ఓమ్

శ్రీగురుభ్యోనమః

# తత్త్వలక్ష్యార్ణవము.



ఇది

శ్రీ ఆయుర్వేద సుధానిధి

పొత్తూరి కృష్ణంరాజయోగి

విరచితము.

మొదటికూర్పు 1500 ప్రతులు.

ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాల, బెజవాడ.

1921

 [వెల 1-0-0



కం॥ శ్రీ సద్గురువరుభావ ని
వాసితమౌ నీయనల్ప ♦ వరచరితము జి
జ్ఞాన నొనర్చెడి నరులకు
భూషణమై వెలయుచుండు ♦ భూలోకమునన్॥



# ఉపోద్ఘాతము.

శ్రీమదనంతకోటి బ్రహ్మాండనాయకుండగు సర్వాత్మకుని యనుగ్రహముచే విరాజిల్లుచున్న యీ మహాప్రపంచమునందుఁ బూర్వకాలంబున, జితేంద్రియులగు మహాయోగీశ్వరులచే నాచరింపంబడి, గురువంశ పరంపరార్జితంబై, శ్రీలక్ష్మినారాయణ యోగీశ్వరానుగ్రహ విశేషంబుచే లభ్యంబైన హఠయోగంబునం దమితానందవశులమైయున్న మాసోదరత్రియంబునుం గనుఁగొని "సర్వజనాదరణీయంబగు నిట్టి మహాయోగం బభ్యసించి కనిపెట్టిన దివ్యవిషయంబులీ యాంధ్ర ప్రపంచమున వెల్లడిజేసి మమ్మానందింపఁ జేయవలసిన"దని యాంధ్రభాషాభిమానులగు స్త్రీపురుషు లనేకులు ప్రోత్సాహపరచినందున, నసత్యభరితంబులగు కవిత్వవర్ణనలతో నిబిడీకృతంబగు పోలికలను వదలి ప్రస్తుతమున మా యనుభవములో నిదర్శనముగాఁ బరీక్షించి తెలిసికొన్న ముఖ్యవిషయములు పామరులకు సహిత మతిసులభముగా నర్థమగునట్టి తేలికపదములతో స్వభావసిద్ధమగు తత్త్వలక్ష్యము లనంతములై గన్పట్టు నట్టి "తత్త్వలక్ష్యార్ణవం"బను వైరాగ్యగ్రంథం బతి సంతోషముతో రచించి, ముద్రింపించడమైనది. కావున నీగ్రంథము గైకొను పాఠకమహాశయులెల్లరును బుస్తకం బతి స్వల్పంబని తలంపక, బాగుగాఁ బరిశీలించి, యిందలి పరమార్థమును గ్రహించి, యీ మహా

యోగమునందుఁ బ్రవేశించి యే మెంతవరకుఁ గృతార్థుల మైతిమో యోచించి, దీనియందుఁ బొందుపర్చఁబడిన, పశుసంరక్షణ విషయమైన సీసపద్య దశకమునందుఁగల స్వైరభావమును గుర్తించి; సుభాషిత పద్యముక్తావళిం గాంచి యానందించెదరుగాక.

ఇట్లు,

కృష్ణంరాజయోగి,

హఠయోగాశ్రమము,

ఏనుగువానిలంక.



ఓమ్.

## —• శ్రీ రాజయోగవంశ సీసమాలిక

శ్రీకర పాత్తూరి • స్థిరవంశసింధువి
భ్రాజద్ధిమాంశుఁడు గంగ • రాజవర్యుఁ
డతనిపుత్త్రుఁడు సద్గు • ణాఢియుక్తుఁడు చిట్టి
నరసింహారాజు నా • పరమపుణ్యా
ధనుని యంశంబున • జననమందిరి గంగ
రాజును శ్రీలక్ష్మి • రాజులనఁగ
నందు రెండవవాని • కనురాగశీలయౌ
కులకాంత బుచ్చి వెం•కమ్మవలన
నధిక సుజ్ఞానులై • నట్టి కృష్ణంరాజు
శ్రీరామరాజు నృ•సింహరాజు
లను సుపుత్రులుగల్గి • రం దగ్రజుఁడు రాజ
యోగీంద్రుఁడని చెప్ప•దగిన లక్ష్మి
నారాయణార్య స•ద్గురు కటాక్షమువల్ల
నతిభక్తితో హఠం • బభ్యసింపఁ
దమ్ము లిర్వురుగూడ • నమ్మ సోదరునిచే
నుపదేశమును బొంది•యుప్పుఁబులుసుఁ
గారమాదిగఁగల్గు • క్రూరవస్తువులతో
మాంసవర్గముఁగూడ • మత్స్యములను
విషసమంబుగ నెంచి • రసయుక్తమైనట్టి
ఫలకందమూలముల్ • పదిలపరిచి

సాత్త్వికభోజనా ♦ సక్తులై నిరతంబుఁ
దినుచును వాయుసా ♦ ధనమువలన
నానందమునుగాంచు ♦ నట్టి మువ్వురికి దీ
ర్ఘాయురారోగ్య జ్ఞా ♦ నాభివృద్ధి
గీ॥ గలిగివర్ధిల్ల ధాత్రిలోఁ ♦ జెలగుసుగుణ
చరితములనిచ్చుహఠయోగ ♦ చర్యలమరి
ఫలము చేకూరె! కష్టముల్ ♦ పండఁబారె!
సుజనవరులార! గుర్తించి ♦ చూడరయ్య॥

ఇట్లు,

శ్రీ సూరంపూడి వేంకట శివరామశర్మ,
హఠయోగాభిమాని.

---



ఓమ్

శ్రీ గురుభ్యోనమః

# తత్త్వలక్ష్యార్ణవము.

## ప్రథమోద్దేశము.

శ్రీ రాజయోగసు • శ్రీయుతంబగు మహా
హఠవిద్య సాధించి • యభ్యసించి
యిహలోకమునయోగ • మహిమఁ జూపెడు మహా
మహిమ సంపాదించి • మనఁదలంచి
కష్టతరంబైన • సృష్టిఁదెల్పెడు మహా
హంసభావముఁ గాంచి • హింసనొంచి
ఘోరమౌ నత్యాశఁ • గోసి వేసెడు మహా
మంత్రముపాసించి • మాయమ్రించి
గీ॥ వివిధసంచార యోగ్యమౌ • విశ్వమెల్లఁ
దిరిగి యానందమున సాధు • చరితమరయు
శిష్యవత్సల వేదాంత • సిద్ధపురుష
రాజయోగీంద్ర! లక్ష్మణా • రాయణార్య! ౧

సీ॥ శ్రీఅవధూత చర్యతో ♦ నవనిపై సర్వదా
తిరుగుచుండియు బోల్ల ♦ వరఘనుండు
గుణధన్యాఖ్య సద్భావ ♦ మరయు కృష్ణంరాజు
తగుశిష్యుఁడని యాత్మఁ ♦ దలఁపు గలిగి
హఠ యోగమూలమౌ ♦ హంసభావముఁజెప్పి
ఘటశుద్ధివిధిఁదెల్పి ♦ ఘననిదాన
మున్నుజూపి గురుసూటి ♦ గనఁజేపి యిట్టి స
త్పరమ సుజ్ఞానమ్మె ♦ మరక్షమించు
గీ॥ నిర్మలాకారయుక్తమై ♦ నిత్యమైన
సర్వవేదాంత సిద్ధాంత ♦ సారమెల్ల
ధారఁబోసినచారు స ♦ ద్గురు వరేణ్య
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౨
సీ॥ ధరణిలోపలఁజెన్న ♦ పురిరాజధానిలో
కృష్ణజిల్లాయందు ♦ శ్రేష్ఠమైన
నరసాపురంబను ♦ పరగణాలోఁదూర్పు
వంక యేనుఁగు వాని ♦ లంకపోల
వరగ్రామమున సదా ♦ వసియింప నర్హమౌ
యోగాశ్రమముగట్టి ♦ బాగుపర్చి
తమ్ములిర్వురితోడ ♦ నమ్మి కృష్ణంరాజు
హఠసాధనముఁజేయు ♦ నటన వెలిసి
గీ॥ వచ్చి పొత్తూరి వంశ పా ♦ వనముఁజేయఁ
దలఁచి వేదాంతబోధ సా ♦ ధన మొసంగి
స్థిరముగాంచిన చారు స ♦ ద్గురువరేణ్యా
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౩

సీ॥ వసుధలో సిద్ధార్థి ♦ వత్సరంబున జ్యేష్ఠ
శుద్ధపాడ్యమియుక్త ♦ శుక్రవార
మునకు సమానమై ♦ తనరి పందొమ్మిది
నూర్ల పందొమ్మిదై ♦ నుతివహించు
ఘనహాయనవత్సరం ♦ బున వేయి ముప్పది
యవ తేది నిటుయోగ ♦ పవనశక్తి
కానంద భరితాత్ముఁ ♦ డైన కృష్ణంరాజు
సాధులందరు సదా ♦ సన్నుతింప
గీ॥ సర్వవేదాంత సారమౌ ♦ సత్యవాక్య
రత్నముల నిమ్ముఁ బూజించి ♦ రమ్యమైన
సంగతులు జెప్పుకొనెఁ జాల ♦ సంతసమున
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౪

సీ॥ అవని వాయుజలాంబు ♦ జాకాశ రవిచంద్ర
గురుశుక్రులకు ధర్మ ♦ గుణమొసంగి
యెంచసాధ్యముగాని ♦ వెన్నియోలోకముల్
వరచరాచరములై ♦ పరగు దివ్య
నక్షత్రములుగాగ ♦ నభములో నమరించి
నియమంబుగాఁ ద్రిప్పు ♦ నిత్యుఁడైన
పూజనీయునిఁ గాంచ ♦ రాజయోగము దప్ప
పరవిద్యలెవ్వియుఁ ♦ బనికిరావు
గీ॥ గాన వేదాంతశాస్త్రాభి ♦ మానుఁడగుచు
సద్గురునిబోధ గన్గొని ♦ సత్యమదపి
ముదముగాంచిన మనుజుండె ♦ ముక్తుఁడిలను
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౫

సీ॥ అవని రాళ్ళను దైవ ♦ మని చెప్పుదురు కొంద
రదికాదు వృక్షంబు ♦ లని వచింతు
రాదిత్యుడే దైవ ♦ మని చెప్పుదురు కొంద
రదికాదు గాయత్రి ♦ యని వచింత్రు
అగ్నియే భగవంతుఁ ♦ డని చెప్పుదురు కొంద
రదికాదు సాగరం ♦ బని వచింత్రు
అఖిలవిశ్వము దైవ ♦ మని చెప్పుదురుకొంద
రదికాదు మంత్రంబు ♦ లని వచింత్రు
గీ॥ గాని సర్వాత్మకునితావు ♦ గానకిట్టి
యమిత సిద్ధాంతపూర్వప ♦ క్షములుచేసి
నీల్గుచున్నారు మానవుల్ ♦ నిశ్చయముగ
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయణార్య! ౬

సీ॥ క్షితియందువర్తించు ♦ ప్రతిజీవికినిఁగల్గు
ముఖ్యమౌ కార్యముల్ ♦ మూఁటినెఱిఁగి
మూఁటికాధారమై ♦ సూటిగా చరియించు
ధాటిగల్గిన వాయు ♦ ధర్మమెఱిఁగి
సాధించుటకు దివ్య ♦ సాధనంబైనట్టి
గురుబోధ మనమున ♦ గుర్తెరింగి
యనయంబు నద్దాని ♦ యనుభవంబును గాంచఁ
గష్టముల్ మదినోర్చి ♦ సృష్టిదెలిసి
గీ॥ హారము సాధించవలెఁగాని ♦ కఠినమైన
మోహపాశంబులోఁ జిక్కి ♦ మోసపోయి
కూలిపోయెదు మనుజుఁడు ♦ వీలుగనున ?
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయణార్య! ౭

సీ॥ తల్లిగర్భము తట్టి ♦ పిల్లవాఁడై పుట్టి
తొల్లి జన్మఁపుగుట్టు ♦ చెల్లఁబెట్టి
పాడుబుద్ధులుపుట్టి ♦ పాపంబులొడిఁగట్టి
యాఁడువాండ్రను ముట్ట ♦ నాశపుట్టి
సంతోషమునుబట్టి ♦ సంసారమునఁజుట్టి
కాంతపై మదిపెట్టి ♦ కలఁగఁగొట్టి
యశనంబుఁజెడఁగొట్టి ♦ యధికమై కన్పట్టు
విషయంబులనుబట్టి ♦ మసలునట్టి
గీ॥ మానవుని కెట్టు గురుబోధ ♦ లోని గుట్టుఁ
బూనమతిఁబుట్టు మాయతో ♦ హీనపెట్టి
తనువుఁజెడఁగొట్టి చచ్చెడు ♦ పనికిఁగాని
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౭
సీ॥ జ్ఞానమెంచని బుద్ధి ♦ హీనుఁడీ యవనిపైఁ
బుట్టినేమంతటఁ ♦ గిట్టనేమి?
కాలమెంచని పాప ♦ కర్ముఁడీ యవనిపైఁ
బెరిగనేమంతట ♦ విరిఁగనేమి?
న్యాయమెంచని పశు ♦ ప్రాయుఁడీ యవనిపై
నడిచెనేమంతట ♦ మడిసెనేమి?
శాంతమెంచని దుఃఖ ♦ వంతుఁడీ యవనిపై
నుండెనేమంతట ♦ మండెనేమి?
గీ॥ గురుని యోగంబుపైఁ జాల ♦ గుర్తు నిలిపి
కష్టములకోర్చి ఘటశుద్ధి ♦ కెష్టమొంది
ముక్తిఁగాంచిన మనుజుండె ♦ ముఖ్యుఁడవని
రాజయోగీంద్ర! లక్ష్మినా♦రాయణార్య! ౮

సీ॥ ధరణిపై మనుజుల్ల ♦ మరణంబు తప్పునా?
ధన ధాన్యరాశుల్ల ♦ ఘనతవలన
పుడమిపై మనుజుల ♦ కెడబాటు తప్పునా?
సతిసుతాదిక బంధ ♦ సమితివలన
క్షితిపైని మనుజుల ♦ కతి బాధతప్పునా?
వివిధ కర్మాభ్యాస ♦ విద్యవలన
అవనిపై మనుజుల ♦ కంతంబు తప్పునా?
యుక్తిచేఁ దిను నుప్పు ♦ భుక్తివలన
గీ॥ బాధఁ గాంచుచు సద్గురు ♦ బోధవినక
మాయ పనులెల్లఁ జేయుచుఁ ♦ గాయశుద్ధిఁ
జేయఁజాలక మానవుల్ ♦ చెడుదు రకట
రాజయోగీంద్ర! లక్ష్మీనా ♦ రాయణార్య! ౧౦

సీ॥ వేదవేదాంగముల్ ♦ బోధగాంచినఁగాని
దేహసంరక్షణ ♦ దెలియ కేడ్చి
షట్శాస్త్రములు నేర్చి ♦ సంతసించినఁగాని
దేహసంరక్షణ ♦ దెలియ కేడ్చి
ఆంగ్లేయ సద్విద్య ♦ నభ్యసించినఁగాని
దేహసంరక్షణ ♦ దెలియ కేడ్చి
మతములన్నిటిగుట్టు ♦ వెతకి యుంచినఁగాని
దేహసంరక్షణ ♦ దెలియ కేడ్చి
గీ॥ నరులు మాయావినోద సం ♦ చారులగుచు
కఠినతరమైన సంసార ♦ కష్టములకు
దాసులై పోవుచుందు రీ ♦ ధరణియందు
రాజయోగీంద్ర! లక్ష్మీనా ♦ రాయణార్య! ౧౧

సీ॥ కని పెంచి కాపాడి ♦ యునికేంటు మనఁజూచు
తల్లిదండ్రులు సదా ♦ తల్లడిలుచు
నొక్కరీతిగఁ బుట్టి ♦ చిక్కులన్నియుఁజూచు
నన్నదమ్ములు సదా ♦ ఖిన్నులగుచు
సంసారమునఁ జొచ్చి ♦ కోరనవన్నియుఁ జూచు
నాలుబిడ్డలు సదా ♦ యుదరిపడుచు
మాయాస్వరూపములఁ ♦ మట్టిఁ జేరుటఁజూచు
లోకులెల్లరు సదా ♦ కేకలిడుచు
గీ॥ నాత్మరూపంబు గుర్తించి ♦ యాచేతఁజైన
పరమ సుజ్ఞానిఁగని చాల ♦ విరసులగుచు
పరిహసింతురు దుర్మార్గ ♦ పరులుగాన
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయనార్య! ౧౨

సీ॥ కాయంబు శోధించి ♦ వాయుధారణఁ జేయు
మర్మ మెఱుంగని వెఱ్ఱి ♦ మనుజులెల్ల
పంచభూతోత్పత్తి ♦ ఫలితమౌ తనురాజ్య
సార మెఱుంగని దురా ♦ చారులెల్ల
తథ్యమొప్పగ మహా ♦ తత్త్వభావముఁ గాంచు
ధర్మ మెఱుంగని పాప ♦ కర్ములెల్ల
సహజవర్తనఁ జూచి ♦ సంతోషమున సృష్టి
మోహ మెఱుంగని శుద్ధ ♦ మూర్ఖులెల్ల
గీ॥ మాయఁగనలేక షట్ఛత్రు ♦ మహిమవలన
ద్రోహమునఁ జొచ్చి ♦ సిగ్గిచచ్చి
పూజ్యులైవారు చుండురీ ♦ పృథ్వియందు
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయనార్య! ౧౩

సీ॥ ఆచారసంకటం ♦ బడఁచనేరక మహా
పరలోకసుజ్ఞాన ♦ మెరుఁగుటెట్లు ?
మానవ జీవసా ♦ ధనమెరుంగక మహా
సన్న్యాసయోగంబు ♦ సలుపుటెట్లు ?
మోసయుక్తంబైన ♦ యాశద్రుంచక మహా
మాయకర్మలువీడి ♦ మసలుటెట్లు ?
బోఁటికూఁటమి దాటు ♦ సూఁటిఁగానక మహా
మురికిదేహాము శుద్ధి ♦ పరుచుటెట్లు ?
గీ॥ మనసు సరి జేయఁజాలని ♦ మనుజులవని
సంస్కృతాంధ్రాది విద్యలు చదువఁగాని
బిందుతత్త్వానుభవసిద్ధిఁ ♦ జెందుటెట్లు?
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౧౪

సీ॥ మలమత్రయముగ లో ♦ పలఁ జేరి యుండఁగా
శుభ్రపర్చని దేహ ♦ శుద్ధియేల?
కామవికారముల్ ♦ కఁడ్లయందుండఁగా
ద్రుంచనేరని మనో ♦ దృష్టియేల ?
ఆశ ముందుగనిల్చి ♦ యాటాడుచుండఁగాఁ
గోసివేయని మాయ ♦ వేషమేల?
మృత్యుయంత్రము పాయ ♦ మూలమందుండఁగా
పట్టనేరని యోగ ♦ ఫలితమేల?
గీ॥ తుచ్ఛమగు మాయకర్మలం ♦ దిచ్ఛబూని
చేయుచును మానవులు సదా ♦ చెప్పుకొనుచు
చెరుపుచున్నారు యోగముల్ ♦ జరుగనీక
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౧౫

సీ॥ పరమార్థమెఱిఁగించు ♦ గురుభావమును గాంచు
తెరువుఁజూడని మాయ ♦ తెలివదేల?
హఠసాధనముఁజేసి ♦ ఘటశుద్ధిఁగావించి
సిద్ధిఁబొందని మాయ ♦ శీలమేల?
పంచభూతము లాది ♦ నుంచి వర్తనసల్పు
విధమెఱుంగని మాయ ♦ విద్యలేల?
కర్మసూత్రమువల్లఁ ♦ గాలచక్రముఁబోవు
ఘాటిగాంచని మాయ ♦ మాటలేల?
గీ॥ వెఱ్ఱులై వేదశాస్త్రముల్ ♦ వెదకి కంఠ
పాఠములుజేసి భావముల్ ♦ పాడుపరిచి
మనుజు లాత్మానుభవదృష్టి ♦ మఱచిరకట!
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౧౬
సీ॥ కడుపులోపల మహా ♦ కల్మషంబుండిన
కపటాత్మునకు నిత్య ♦ కర్మలేల?
శత్రులార్వురుఁ జేయు ♦ శాసనంబునఁ జేరు
నట్టివానికి శాస్త్ర ♦ కట్టులేల?
ఘనదుర్గుణములతోఁ ♦ గాసిల్లు చుండిన
ఖేదాత్మునకు యోగ ♦ బోధలేల?
సంసారదోషంబు ♦ సంభవంబైనట్టి
కష్టజీవికి సత్య ♦ నిష్ఠలేల?
గీ॥ నంచు మదినెంచి పుణ్యులీ ♦ యంశములకుఁ
దగిలి తగులక వర్తించి ♦ ధరణియందు
దుఃఖమును వీడుదురు యోగ ♦ దృష్టివలన
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౧౭

సీ॥ రోగముల్ గనలేని • యోగసాధన లేల?
చెప్పఁగూడనిసిద్ధి • చేటుగాని
సృష్టిఁ గాంచఁగఁ లేని • కష్టవర్తన లేల?
మటుమాయగాఁబోవు • నటనగాని
సంసార మెరుఁగని • సన్న్యాస మదియేల?
బహుకష్టమగు ముక్తి • బ్రతుకుగాని
భుక్తిగానని మహా • భక్తిమార్గం బేల?
పనికిమాలిన హీన • పదవిగాని
గీ॥ మేలు గనకిట్టి భ్రాంతిలోఁ • గూలిపోయి
పీలు చెరిపుచ్చు జ్ఞానంబుఁ • గాలవేసి
తిరుగుదురు పాడుమానవుల్ • స్థిరములేక
రాజయోగీంద్ర! లక్ష్మీనా • రాయణార్య! ౧౩

సీ॥ మదియందుఁగల శత్రు • వధఁ జేయఁజాలక
వేషముల్ వేయు స • న్న్యాసమేల?
రాగయుక్తంబైన • భోగంబులను గోరి
రోగముల్ గనురాజ • యోగమేల?
భుక్తికై దుఃఖించి • యుక్తమెంచక ద్రోహ
చింతలోఁ గూలు వే • దాంతమేల?
సారహీనంబైన • సంసారమునఁ జేరి
మోసలేకేడ్చు సు • జ్ఞానమేల?
గీ॥ తను వెరుంగని వేదాంత • మును గణించి
తిక్క తలకెక్కి గుండ్రించి • కక్కునట్టి
నరుల కేలాగు ఋజుమార్గ • మెరుక పడును
రాజయోగీంద్ర! లక్ష్మీనా • రాయణార్య! ౧౪

సీ॥ పొట్టకై సర్వదా ♦ రట్టుఁ బొందుచు మహో
వేద విద్యలునేర్చి ♦ వెలయ నేల?
వరపదార్థములెల్ల ♦ వండి మ్రింగుచు మాయ
ధనధాన్యములఁగూర్చి ♦ దాచ నేల?
సతిసుతాదులవల్ల ♦ వెతలు బొందుచు సదా
క్షితియందు మతిలేక ♦ బ్రతుక నేల ?
యాశలోఁబడిపోయి ♦ గాసిఁ జెందుచు దివ్య
నరజన్మ ఫలితంబుఁ ♦ జెరుప నేల?
గీ॥ సచ్చిదానంద బ్రహ్మంబు ♦ నిత్యమగుటఁ
దెలిసి పరీకించి మానవుల్ ♦ మెలఁగఁ దగిన
కాల సత్యస్వరూపంబుఁ ♦ గాంచెనేని
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౨౦

సీ॥ వేదశాస్త్రాదుల ♦ వాదమంతయుఁగూడి
హంసమార్గంబు నం ♦ దణఁగిపోవు
ధనధాన్యరాసుల ♦ ఘనత సర్వంబును
సతికోర్కెలోఁజొచ్చి ♦ సమసిపోవు
జప తపంబులఁగల్గు ♦ నుపయోగ మంతయు
నతిమోహదృష్టియం ♦ దతికిపోవు
కర్మభ్రాంతిని జేయు ♦ ధర్మంబులన్నియుఁ
దిరిగి జన్మంబుతో ♦ మరిగిపోవు
గీ॥ నన్ని కార్యంబు లీరీతి ♦ నంతమగును
గాన ముక్తికి మార్గంబుఁ ♦ గాంచుటకును
హఠము సాధింపవలెఁ జిత్త ♦ కఠినమూని
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౨౧

సీ॥ ధౌతిఁజేయఁగ శ్లేష్మ ♦ భీతిఁబోవును వస్తి
కౌలికర్మలవల్ల ♦ మాలినముడుగు
నేతి త్రాటకవిధుల ♦ చేత ముక్కును కండ్లు
పరిశుద్ధినొందు క ♦ పాలభాతి
వలన భ్రూమధ్యంబు ♦ బలము శుభ్రముగాంచు
షట్కర్మ లివిసల్పి ♦ సంతసమున
నుష్ణభక్తి రచుట ♦ కొప్పకెల్లప్పుడు
వాయుసాధనమును ♦ జేయుచుండి
గీ॥ పీనుఁగులలిండి మొదలంట ♦ పూని సత్య
మహాని కుంభకవిధులను ♦ బూనవలయుఁ
గాని మాటల హఠసిద్ధి ♦ గలుగబోదు
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయనార్య! ౨౨

సీ॥ సోహమెప్పుడో వీడి ♦ దేహయంత్రముతోడ
మాయమై చనిపోవు ♦ న్యాయమరసి
పలురీతులగు స్నాన ♦ ములు జేయుచును సదా
ఫలకందమూలముల్ ♦ గలిగి వెలయు
సృష్టిలో నరజాతి ♦ కిష్టమౌ రుచులెల్లఁ
గనిపెట్టితిని పాయి ♦ కముగ వాయు
వునుబట్టి కుంభకం ♦ బొనరించి ఘటశోధ
నముఁ జేయవలెఁగాని ♦ యమితమైన
గీ॥ భుక్తిఁగోరుచు స్థిరమైన ♦ బుద్ధిలేక
కల్లలరచుచు నెల్లయెం ♦ గిళ్ళుఁదినుచుఁ
దిరుగు నరులకు హఠయోగ ♦ మొదుకపడునె ?
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయనార్య! ౨౩

సీ॥ ఘనయోగినని సదా ♦ గంజాయి వాడెడు
మనుజుఁడీ హఠయోగ ♦ మహిమఁ గనునె?
సృష్టిస్వభావమా ♦ నష్టమొంచెడు మూఢ
మనుజుఁడీ హఠయోగ ♦ మహిమఁ గనునె?
హింసఁజేయుచు సదా ♦ సంసారమునఁ దేలు
మనుజుఁడీ హఠయోగ ♦ మహిమఁ గనునె?
పులుసువ్వకారముల్ ♦ గలిపి భక్షణఁజేయు
మనుజుఁడీ హఠయోగ ♦ మహిమఁ గనునె?
గీ॥ దేహమునఁబుట్టు సాత్మసం ♦ దేహరట్టుఁ
దీరఁజేసెడు వాయుసం ♦ చారశక్తి
మరిగి సాధించు సద్గురుఁ ♦ జేరుఁగుఁగాని
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౨౮

సీ॥ మాటలే వేదాంత ♦ నూటియుంచును సదా
మతబోధఁ గావించు ♦ చతురులైన
తత్త్వముల్ వేదాంత ♦ ధర్మమంచును సదా
యతి గానమొనరించు ♦ నధికులైన
పద్యముల్ వేదాంత ♦ విద్యయంచును సదా
చదివి యర్థముఁజేయు ♦ సరసులైన
శ్లోకముల్ వేదాంత ♦ శోధయంచును సదా
శ్రద్ధతోఁజూచు ప్ర ♦ సిద్ధులైన
గీ॥ ధరణిలోపల నెట్టి స ♦ త్పురుషులైన
హఠము సాధించి గుర్తించి ♦ హంస తత్త్వ
సిద్ధిఁ గనకున్న దోషముల్ ♦ దిద్దుటెట్లు?
రాజయోగీంద్ర! లక్ష్మినా♦రాయణార్య! ౨౯

సీ॥ బ్రతికినన్నాళ్ళు సం ♦ బంధ సౌఖ్యముఁగోరి
యేడ్చు యంతయు వీడు ♦ టెరిఁగియుండి
సతి సుతాదులఁబెంచి ♦ సంతోషపడి నేలఁ
గూలిపోయెదు విద్యఁ ♦ గూర్చుచుండి
యాశదీరక పనుల్ ♦ చేసి యార్జించు స
ర్వాదాయనాశనం ♦ బరయుచుండి
పులుసుప్పుకారముల్ ♦ గలిపి మ్రింగుచు సదా
పలురోగములకు లోఁ ♦ బడుచునుండి
గీ॥ సృష్టిఁజూచుచు నిరత వి ♦ శిష్టములను
దెలిసి తెలియక వెతఁగాంచి ♦ మెలఁగునట్టి
మానవులకెట్లు గురుబోధ ♦ మదికిఁదట్టు?
రాజయోగీంద్ర! లక్ష్మినా♦రాయణార్య! ౨౬

సీ॥ గాయత్రియనునది ♦ గానమంత్రముగాదు
తత్త్వభావముఁగాంచు ♦ తలఁపుగాని
యాగముల్ జేయుట ♦ భోగంబులకుఁగాదు
నీతి ప్రబోధించు ♦ నిష్ఠగాని
హఠయోగమనునది ♦ మఠముఁజేరుటగాదు
ఘటశుద్ధిఁగావించు ♦ నటనగాని
సన్న్యాసమనునది ♦ సతిని వీడుటగాదు
యత్యాశ ఖండించు ♦ నాజ్ఞగాని
గీ॥ యాది దెలియక మూఢు లీ ♦ యవనియందు
మాయకోడిఁగట్టి గురువులై ♦ మానవులకు
బోధఁజేతురు పరమాత్మ ♦ శోధలేక
రాజయోగీంద్ర! లక్ష్మినా♦రాయణార్య! ౨౭

సీ॥ గాయత్రిభావ మా ♦ దాయ పఠ్చినఁ జాలు
పంచభూతములు సి ♦ ద్ధించినట్లె!
హంసభావముఁ జూచి ♦ హింస మానినఁజాలు
సర్వ ధర్మంబులు ♦ సలిపినట్లె!
నిత్యమాలోచించి ♦ సత్యమూనినఁ జాలు
నాముష్మిక సుఖంబు ♦ లబ్బినట్లె!
సాత్త్వికాహారియై ♦సంచరించినఁ జాలు
స్థిరమైన గురుసూటి ♦ దొరకినట్లె!
గీ॥ తెలిసి తెలియని మనుజు లీ ♦ కలియుగమున
వందలును వేలు లక్షలు ♦ వరుసఁదప్పి
పలువిధంబులఁ గష్టముల్ ♦ పడుదు రకట!
రాజయోగీంద్ర! లక్ష్మినా♦రాయణార్య! ౨౮

సీ॥ ఉపనిషద్వాక్యార్థ ♦ మూహించుటేగాని
మాయకార్యంబులు ♦ మాన లేక
యుపవాసములఁగోర్చి ♦ తపియించుటేగాని
కల్మషాదుల పొట్టఁ ♦ గడుగ లేక
ధర్మమార్గము సదా ♦ తలపెట్టుటేగాని
మనసులో మర్మంబు ♦ లణఁచ లేక
యతిభుక్తికై మహా ♦ వేఁతఁజెందుటేగాని
యాహారనిర్ణయం ♦ బరయ లేక
గీ॥ మాయ వేషంబులను వేసి ♦ మమతఁగాంచి
సర్వమాశించి తుద కేమి ♦ నిర్వహించి
పట్టుకొని పోదు రిటువంటి ♦ పాడునరులు
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౨౯

సీ॥ సన్న్యాసమునకంటె ♦ సౌఖ్యంబు లేదంచు
ముష్టికై పనిఁబూను ♦ మూర్ఖులెల్ల
శివమతంబునకంటె ♦ స్థిరమేమి లేదంచు
దరిఁగానలేని చా ♦ దస్తులెల్ల
వైష్ణవంబునకంటె ♦ వరభక్తి లేదంచు
హీనులై చరియించు ♦ దీనులెల్ల
శాక్తేయమునకంటె ♦ శరణంబు లేదంచు
గల్లుమాంసమువాడు ♦ కఠినులెల్ల
గీ॥ జ్ఞానమార్గంబు చెడి భక్తి ♦ హీనులగుచు
మూలమెంచక యాశలోఁ ♦ గూలిపోయి
కష్టపడి చచ్చుటేగాని ♦ కనరు ముక్తి
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయణార్య! 30

సీ॥ కాంతసౌఖ్యముఁగోరి ♦ కామమాపఁగలేక
కలసినంతనె చింతఁ ♦ గలుగుచుండెఁ
గలిగినంతనె దేహ ♦ బలమెల్లఁ జెడిపోయి
యతికష్టములువచ్చి ♦ యంటుచుండె
అంటినవెంటనే ♦ యాదాయమును జేయు
మానసంబున వాంఛ ♦ మసలుచుండె
మసలినంతనె సర్వ ♦ విషవస్తువులుగూడ
ఘనపదార్థములుగాఁ ♦ దనరుచుండెఁ
గీ॥ దనరుచుండు పదార్థముల్ ♦ దినదినంబు
భోగమంచును భుజియించి ♦ భొజ్జపెంచి
కూలుచున్నారు మానవుల్ ♦ గుత్తుఁదప్పి
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయణార్య! 3౧

సీ॥ అలిసేవకుఁ బూట ♦ కూలిఁ జేసెడు నీచుఁ
డిహలోకమున ఖ్యాతి ♦ మహిమఁ గనునె?
మాయబుద్ధులు గల్గి ♦ మాటలాడెడు దుష్టుఁ
డవనిపై దివ్యాను ♦ భవముఁ గనునె?
పలువిధంబుల నష్ట ♦ ములకన్న నోను మూఢుఁ
డిలయందు సంపూర్ణ ♦ ఫలముఁ గనునె
సూటిఁగానక పొట్ట ♦ కూటికేడ్చెడు దీనుఁ
డుర్విపై స్థిరమైన ♦ యుక్తిఁ గనునె
గీ॥ పెక్కుసంగతులను నేర్చి ♦ టక్కుఁ జూప
కెరిఁగి యుండిన లోకమైన ♦ జతుపువట్టి
పురుషవశ్యుండె యోగపం ♦ పూర్ణుఁడవని
రాజయోగీంద్ర ! లక్ష్మినా ♦ రాయణార్య! 32

సీ॥ సంసారమును వీడి ♦ సన్యసింపఁగఁ గోరు
మనుజుఁ డొక్కొక వేళ ♦ మాయఁ దెలిసి
రోగబాధలు చూచి ♦ యోగసౌఖ్యముఁ గోరు
మనుజుఁ డొక్కొక వేళ ♦ మాయఁ దెలిసి
వివిధకర్మలవల్ల ♦ విసికి పుణ్యముఁ గోరు
మనుజుఁ డొక్కొక వేళ ♦ మాయఁ దెలిసి
యెందుకీ తనువంచు ♦ నెంచి ముక్తినిఁ గోరు
మనుజుఁ డొక్కొక వేళ ♦ మాయఁ దెలిసి
గీ॥ నిలుపఁజాలక దుర్బుద్ధి ♦ నిలువఁ జేసి
పుట్టు సుజ్ఞాన మొకచోటఁ ♦ గట్టిపెట్టి
మాయమైపోవు సంసార ♦ మగ్నుఁ డగుచు
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! 33

సీ॥ సంసారమునఁ జేరి ♦ చావఁబూతురుగాని
లక్ష్యముంచరు మహా ♦ లాభమునకు
పిచ్చిబట్టిన రీతి ♦ కుక్షిఁ గేడ్తురుగాని
లక్ష్యముంచరు మహా ♦ లాభమునకు
పలుదుఃఖముల కోర్చి ♦ కులుకుచుందురుగాని
లక్ష్యముంచరు మహా ♦ లాభమునకు
తెగఁదిని మత్తెక్కి ♦ పొగరుఁ గాంతురుగాని
లక్ష్యముంచరు మహా ♦ లాభమునకు
గీ॥ నిట్టిపలుగాకి మనుజు లీ ♦ సృష్టియందు
హీనకర్మలు గుర్తించి ♦ మానలేక
చెరుపుచున్నారు యోగముల్ ♦ జరుగనీక
రాజయోగీంద్ర! లక్ష్మణా! ♦ రాయణార్య! 38

సీ॥ మంత్రశాస్త్రమునందు ♦ మహిమఁ జూచితినంచుఁ
జెప్పి తప్పుడుపనుల్ ♦ చేయుచుండి
శిలరూపమున దైవ ♦ బలముఁజూచితినంచుఁ
జెప్పి తప్పుడుపనుల్ ♦ చేయుచుండి
మతములన్నిఁటియందు ♦ మసలిచూచితినంచుఁ
జెప్పి తప్పుడుపనుల్ ♦ చేయుచుండి
యోగీశ్వరులచెంత ♦ కేగి వచ్చితినంచుఁ
జెప్పి తప్పుడుపనుల్ ♦ చేయుచుండి
గీ॥ మానసంబున మితిలేని ♦ మలినముండి
పైకి ఘనవేషధారులై ♦ బరగుచుండి
కూలుచున్నారు దుర్జనుల్ ♦ గుర్తులెండి
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయణార్య! 39

సీ॥ ధరణిలోపలఁ జెప్ప ♦ లెరిఁగి చూచితినంచుఁ
జెప్పుచుండియు దారిఁ ♦ దప్పితిరిగి
వేదశాస్త్రములెల్ల ♦ వెదకి కాంచితినంచుఁ
జెప్పుచుండియు మాయఁ ♦ గప్పితిరిగి
మానవాచరణంబు ♦ మదినెరుంగుదునంచుఁ
జెప్పుచుండియు నోరు ♦ విప్పితిరిగి
శూరత్వమున భూమిఁ ♦ జుట్టఁబెట్టెదనంచుఁ
జెప్పుచుండియు భార్య ♦ కొప్పితిరిగి
గీ॥ చెప్పుటేగాని చేతలు ♦ చేతగాక
యఖిలమాయలకొడిఁగట్టి ♦ యంతమొందు
మానవులకెట్లు వైరాగ్య ♦ మహిమదెలియు
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయణార్య! 31

సీ॥ తత్త్వభావముఁ గాంచి ♦ తను వెరిఁగినవాఁడు
సంసారచింతతోఁ ♦ జావనేల?
మనసులో దుశ్చింత ♦ లను వధించినవాఁడు
తప్పుపదార్థముల్ ♦ దలఁపనేల?
కడుపులోపలికుళ్ళు ♦ గడుగనేర్చినవాఁడు
ఒడలికై దుఃఖముల్ ♦ గుడువనేల?
ఆధారమున వాయు ♦ శోధఁజేసినవాఁడు
రోగంబులకుఁ జాటు ♦ దాగనేల?
గీ॥ రాజయోగానుభవ దివ్య ♦ తేజమెరిఁగి
సద్గురుధ్యానముద్రచే ♦ సత్యమైన
జాటఁబట్టిన వానికి ♦ బాధలేల
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయణార్య! 32

సీ॥ తనువులోపల నెల్లఁ ♦ దప్పులార్జనఁ జేసి
యెడదప్పఁజే రిపుములు ♦ గుడవనేల?
మనసులోపల నెల్ల ♦ గుణములార్జనఁ జేసి
మాత్సర్యవేషములచే ♦ మసలనేల?
దశవాయువుల కెల్ల ♦ విషములార్జనఁ జేసి
స్థిరముఁ గానక సదా ♦ తిరుగనేల?
యింద్రియంబుల కెల్ల ♦ నిచ్ఛలార్జనఁ జేసి
సన్న్యాసమునఁ జేరి ♦ చావనేల?
గీ॥ విహితగురుమూర్తి కరుణచే ♦ విద్యమెఱిఁగి
గతివిచారించి వర్తించు ♦ యతికి సర్వ
సంగతులు దేహమునఁజూడ ♦ జక్కఁబడవె?
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయణార్య! ౩౮
సీ॥ అర్థమేమియులేని ♦ మొద్దుమాటలు కొన్ని
యోగలక్ష్యములంచు ♦ వాగివాగి
తెలివిమాలినవచ్చి ♦ పలుఁగుమాటలుకొన్ని
తత్త్వభావములంచుఁ ♦ దలఁచి తలఁచి
మాతృభాషను గల్గు ♦ మాయమాటలుకొన్ని
బ్రహ్మవిద్యయటంచు ♦ భ్రమసి భ్రమసి
బీజంబులని చెప్ప ♦ పిచ్చిమాటలు కొన్ని
కుదుమంత్రములుగొంచు ♦ ముదిసి ముదిసి
గీ॥ పరము సాధించు సుజ్ఞాన ♦ మొదుక లేక
మాఁటిచే బాధపడి పొట్ట ♦ కూఁటి కేడ్చి
మాయమై పోవుచుందు రీ ♦ మనుజులకట!
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయణార్య! ౩౯

సీ॥ పొగచుట్టఁ గాల్చుట ♦ పొడుము బీల్చుట
పగలునిద్రించుట ♦ తెగులుబడుట
గంజాయిఁదాగుట ♦ లంజలఁగోరుట
సారాయి కల్లు ద్రాగ ♦ సములఁ గొనుట
తెగమెక్కుటకు సుఖం ♦ బగు షిండివంటల్కు
బుఖుపుప్పాకారంబు ♦ లెలమిఁదినుట
యనెడు దుర్గుణపుంజ ♦ మధికార మొనరింప
మనసు సేవకవృత్తి ♦ మరిఁగితిరుగు
గీ॥ నట్టివానికి యోగముల్ ♦ పట్టుపడునె?
యాపనాదిగ ముద్రిల ♦ నభ్యసించి
సన్యసించిన శాస్త్రముల్ ♦ చదివి వినిన
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయణార్య! ౮౦
సీ॥ ఆదికాలమునుండి ♦ యధ్యాత్మ చింతచే
మాంసభక్షణవీడి ♦ హింసమాని
సన్మార్గ చరితులై ♦ సంసారకష్టముల్
దుఃఖించఁ గల్గియు మనో ♦ దృష్టి మరచి
బాధఁజెందుచు మాయా ♦ బంధనంబులఁజిక్కి
చప్పిడీ తనువున ♦ కొప్పదనుచు
పులుసుప్పుకారముల్ ♦ కలనైన వీడక
విపరీతములె! యోగ ♦ విఫలులైరి
గీ॥ దీర్ఘ కాలంబునుండి దు ♦ ర్మార్గు లగుచు
మాంసభక్షణ విడువని ♦ మానవులకు
మోక్షసాధన కార్యముల్ ♦ సాగు టెట్లు?
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయణార్య! ౮౧

సీ॥ మనుజాశనముగాని ♦ మాంసాదులనుగూడఁ
బులుసుప్పు కారముల్ ♦ గలిపి వండి
దుష్ట స్వభావమౌ ♦ దుంపలాకులు గూడఁ
బులుసుప్పు కారముల్ ♦ గలిపివండి
చెప్పఁగూడని పాడు ♦ చేదు కాయలుగూడఁ
బులుసుప్పు కారముల్ ♦ గలిపి వండి
రోషపదార్థమునైనఁ ♦ దీపినైతముఁ జేర్చి
పులుసుప్పు కారముల్ ♦ గలిపి వండి
గీ॥ భోజనముఁ జేయుటే మహా ♦ భోగమంచుఁ
దప్పఁ గనలేక వ్యాధుల ♦ కొప్పగొనుచు
మ్రింగువారికి యోగ మొ ♦ సంగరాదు
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయణార్య! ౪౨

సీ॥ ఉప్పుభక్షించు టీ ♦ యుర్వియందతిరోత
పాడిఁగోరుటఁగూడ ♦ పరమరోత
మత్స్య మాంసములతో ♦ మనఁదలంచుటరోత
కల్లుఁద్రావుట ♦ యంతకంటెరోత
గంజాయిసేవించి ♦ గాసిఁజెందుటరోత
మాయాస్వరూపమౌ ♦ మహిమరోత
సతికి సంబంధించు ♦ ప్రతికార్యమును రోత
గతులెరుంగని మొండి ♦ బ్రతుకురోత
గీ॥ సత్యమెరుఁగని మనుజులీ ♦ కృత్యములను
వీడఁ జాలక మత్తులై ♦ విర్రవీగి
శ్రేష్ఠముగ నెంచి ప్రేమతోఁ ♦ జేతురకట!
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయణార్య! ౪౩

సీ॥ ఉప్పుఁదినెడు జీవు ♦ లుర్విపై నున్నవే ?
పలువిధంబుల రోగ ♦ బాధఁ గనుచు
ఉప్పుఁదినెడుజీవు ♦ లుర్విపై నున్నవే?
యతిభుక్తికై మహా ♦ వెతలు గనుచు
ఉప్పుఁదినెడు జీవు ♦ లుర్విపై నున్నవే?
సంసార చింతతోఁ ♦ జావుఁగనుచు
ఉప్పుఁదినెడుజీవు ♦ లుర్విపై నున్నవే?
మిథ్యగాఁ జనిపోవు ♦ విద్యఁగనుచు
గీ॥ మోసపడి యేడ్చు జీవముల్ ♦ లేశమైన
లేవుధరపైని మానవుల్ ♦ లవణ రుచిని
మరిగి పలురీతి కష్టముల్ ♦ గరతు రకట!
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౪౪
సీ॥ మానవాహార స ♦ న్మహిమఁ జూచిన ఘనుం
డింతికై మదియందుఁ ♦ జింతఁగనునె?
మానవాహార స ♦ న్మహిమఁజూచిన ఘనుం
డేపదార్థమునైన ♦ నాపుకొనునె?
మానవాహార స ♦ న్మహిమఁజూచిన ఘనుం
డెవ్వడైనను హింస ♦ కొప్పుకొనునె?
మానవాహార స ♦ న్మహిమఁజూచిన ఘనుం
డెట్టివ్యాధులకైనఁ ♦ బట్టువడునె?
గీ॥ దీక్షమదిఁబెట్టి సృష్టి శో ♦ ధించెనేని
మానవుని దుష్ప్రయత్నముల్ ♦ మారిపోయి
జీవపరమాత్మలకు నైక్య ♦ భావమమరు
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౪౫

సీ॥ సమభాగమై యుప్పు ♦ సర్వవర్ణములందుఁ
గలిసియుండఁగ రుచుల్ ♦ గానలేక
సమభాగమై యుప్పు ♦ సర్వశాకములయందుఁ
గలిసియుండఁగ రుచుల్ ♦ గానలేక
సమభాగమై యుప్పు ♦ సర్వమాంసములందు
గలిసియుండఁగ రుచుల్ ♦ గానలేక
సమభాగమై యుప్పు ♦ సర్వధాన్యములందుఁ
గలిసియుండఁగ రుచుల్ ♦ గానలేక
గీ॥ సత్యమగు మంచిరుచులెల్లఁ ♦ జప్పిడంచు
మానవులు పాదులవణంబు ♦ మాటుపరిచి
కారమును జేర్చి తిని రోగ ♦ దూరులైరి
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౪౬
సీ॥ వసనాభి నెపుడైన ♦ సిసలుగా మ్రింగితే
ఘడియలో మృత్యుసం ♦ దడినిఁజూపుఁ
పాషాణ మేదైన ♦ లేశంబు మ్రింగితే
ఝాములోపల రుద్ర ♦ భూమిఁజూపుఁ
ఖనిజంబు లేవైన ♦ ననిశంబు మ్రింగితే
నెలలోన మరణ బా ♦ ధలనుజూపు
రసమిశ్రి మేదైనఁ ♦ గృషిఁజేసి మ్రింగితే
యేఁడాదిలో వల్ల ♦ కాఁడుఁజూపుఁ
గీ॥ గాని పులుసుప్పుకారముల్ ♦ గలిపి తినిన
మానవుల సుస్వరూపముల్ ♦ మాపుఁజేసి
సర్వకష్టంబులిడి పాడు ♦ చావుఁజూపు
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౪౭

సీ॥ పర్ణముల్ మరోలముల్ ♦ పండ్లుకాయలుదుంప
లాదిగాఁ గొన్నింటి ♦ నాదరముగఁ
బులుసుప్పు కారముల్ ♦ గలిపి నిత్యముపండి
మధురపదార్థముల్ ♦ మాటుపరిచి
తెగమెక్కి పొగరెక్కి ♦ జగమెరుంగక దుఃఖ
వంతులై ఘోరదు ♦ .రంతమైన
సంసారమున కొప్పి ♦ సత్యంబుఁగనఁజాల
కఖిలదోషంబులం ♦ డెంటుఁజెంది
గీ॥ తీవ్రమగు రోగములతోడ ♦ తిప్పలుబడి
మేనుఁజెడఁగొట్టి సంతోష ♦ హానిఁజేయు
నరుల కేలాగు వైరాగ్య ♦ మెరుకపడును
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౨౮

సీ॥ పుట్టినప్పటి నుండి ♦ పురిటింటిలోఁగూడఁ
బాదుతైలములెల్లఁ ♦ బైకిఁ జమిరి
యుగ్గు ముక్కటములం ♦ బెగ్గుఁజూడక నిత్య
మతిశ్రద్ధతోఁ ♦ బొట్ట కతుకఁజేసి
కర్పూరమాదిగా ♦ ఘన విషంబుల నెల్లఁ
బెగమ్రింగి పాలిచ్చి ♦ తేజమడఁచి
వరియన్నమున కుప్పు ♦ సరిపుచ్చి నేతితోఁ
దినిపించి వ్యాధుల ♦ కనువు పరచి
గీ॥ తనువుఁ జెడఁగొట్టు నభ్యాస ♦ మునకుఁ దెచ్చి
మాతయే మానవాకార ♦ మహిమఁ జెరుచు
నెరిఁగి వర్తించు పురుషుఁడే ♦ పరమగురుఁడు
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౨౯

సీ॥ క్షితిపైని సరిలేని ♦ మతబోధ లొరులచేఁ
జేయింపవచ్చుఁ దాఁ ♦ జేయవచ్చు
నవనిపై సరిలేని ♦ యధికారమొరులచే
నడిపింపవచ్చు దా ♦ నడుపవచ్చు
భూమిపై సరిలేని ♦ కామితంబొరులచేఁ
బొందింపవచ్చు దాఁ ♦ బొందవచ్చు
ధరణిపై సరిలేని ♦ దానంబులొరులచే
నిప్పింపవచ్చు దా ♦ నీయవచ్చుఁ
గీ॥ గాని పశుజాతిఫలితముల్ ♦ ఘనతఁ జేసి
యిష్టులై మిగులు మనుజుల ♦ దుష్టగుణము
మానిపింపఁగ లేరెట్టి ♦ జ్ఞానులైన
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయణార్య! ౫౦

సీ॥ ఆచారమనునది ♦ యన్నమాదిగఁ గల్గు
వంటకంబుల కెల్ల ♦ నంటఁగట్టి
ముట్టరాదని కర్మ ♦ కట్టుఁగట్టిన వేద
శాస్త్రవేత్తలె యనా ♦ చారు లగుచు
చల్ల ఘృతంబులం ♦ దెల్లవారలు గల్పు
నెంగిల్లుఁ దినుచుండు ♦ టెరిఁగియుండి
పలు హేయములఁ జేర్చి ♦ పచనపర్చినఁ గాని
తినవచ్చునని మహా ♦ ఘనతఁ జేసి
గీ॥ క్షీరమాదిగఁ గొన్ని ప ♦ దార్థములకు
నంటులేదని తెగమిగి ♦ యమితమైన
నీతి బోధించుచుండిరి ♦ భూతలమున
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయణార్య! ౫౧

సీ॥ ధనధాన్యములు చేర్చి ♦ ఘనతఁగాంచుటగాని
తను వశాశ్వతమంచుఁ ♦ దలఁపలేక
విభవంబనుచు గొప్ప ♦ సభలు చేయుటగాని
తత్త్వభావముఁ జూచి ♦ తరచలేక
కుటిలమౌ నీతులను ♦ నటనఁ జేయుటగాని
ఘటశుద్ధివిధు లేమిఁ ♦ గాంచలేక
పిండివంటలతోడఁ ♦ దిండిఁ జేర్చుటగాని
యుక్త్యాసయోగంబు ♦ నరయలేక
గీ॥ మాయపనులెల్ల శ్రద్ధతోఁ ♦ జేయు మూఢ
మానవులు సత్యమార్గంబు ♦ మఱచి సాధు
నిందఁ జేతురు దుష్కర్మ ♦ నిరతులగుచు
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౫౨

సీ॥ ఉపయోగమని మంత్ర ♦ జపదీక్షఁ గావింప
నది మహావ్యర్థ మీ ♦ యవనియందు
జయవిలాసములతో ♦ జగమెల్లఁ బాలింప
నది మహావ్యర్థ మీ ♦ యవనియందు
సతిసుతాదులఁ గూడి ♦ సద్యశం బార్జింప
నది మహావ్యర్థ మీ ♦ యవనియందు
మన్ను సువర్ణమౌ ♦ మహిమ సంపాదింప
నది మహావ్యర్థ మీ ♦ యవనియందు
గీ॥ దేహయంత్రంబునం దిట్టి ♦ యూహలెన్నొ
కలిగి పలుదుఃఖములఁ బెట్టి ♦ తొలఁగిపోవు
టెఱిఁగియుండియు నరులు ను ♦ స్థిరతఁ గనరు
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౫౩

సీ॥ సద్వంశ జనితుఁడౌ ♦ విద్వాంసుఁడైనను
విఖ్యాతిఁగల సత్క ♦ వీంద్రుఁడైన
మంత్రిచింతనసల్పు ♦ మహనీయుఁడైనను
వన్నెకెక్కిన ధైర్య ♦ వంతుఁడైన
నతిసత్యచరితుఁడౌ ♦ క్షితికాంతుఁడైనను
వాసిఁగాంచినధర్మ ♦ వైద్యుఁడైన
పరసాగ్రగణ్యుఁడౌ ♦ సంసారియైనను
బుణ్యయాత్రలఁ జేయు ♦ ధన్యుఁడైనఁ
గీ॥ దుదకుఁ బుడమిని సర్వంబు ♦ వదలివేసి
కోరికలువీడి తెగనవ్వి ♦ యూరిబైట
వల్లకాఁటికిఁ జేరఁగా ♦ వలసివచ్చు
రాజయోగీంద్ర! లక్ష్మనా ♦ రాయణార్య! ౫౪

సీ॥ రాజ్యమేలుచు ధర్మ ♦ రక్షఁ జేయుచు నున్న
సర్వకర్మలు సదా ♦ సలుపుచున్న
భూమి సంపాదించి ♦ క్షేమపద్ధతిఁ గన్న
నిండ్లుగట్టించుట ♦ కిష్టమున్న
నతిద్రవ్యమార్జించి ♦ బ్రతుకఁజూచుచునున్న
ధరణిపై ఘనముగాఁ ♦ దిరుగుచున్న
నవసరంబగు వృత్తు ♦ లధికంబుగానున్న
సగమైన వెన్నెరో ♦ మిగిలియున్నఁ
గీ॥ గాలమాసన్నమైనచోఁ ♦ గట్టిపెట్టి
మాటలాడక వ్యర్థులై ♦ మట్టిఁగలియు
టెరిఁగియుండియు నరులాత్మ ♦ గురుతుఁగనరు
రాజయోగీంద్ర! లక్ష్మనా ♦ రాయణార్య! ౫౫

సీ॥ అకళంకవంతుఁడౌ ♦ సుకవీంద్రుఁడైనఁ దా
నతికష్టపడు కాల ♦ గతినిఁబట్టి
అతిపుణ్యనిరతుఁడౌ ♦ నాచార్యుఁడైనఁ దా
నతికష్టపడు కాల ♦ గతినిఁబట్టి
అతిధర్మయుక్తుఁడౌ ♦ క్షితికాంతుఁడైనఁ దా
నతికష్టపడు కాల ♦ గతినిఁబట్టి
అతిధైర్యశీలుఁడౌ ♦ మతికర్తయైనఁ దా
నతికష్టపడు కాల ♦ గతినిఁబట్టి
గీ॥ కాలగతివల్ల మానవుల్ ♦ నేలఁగలియు
టెఱిఁగి యజ్ఞానవంతులై ♦ మరచిపోయి
సర్వదోషంబు లార్జింతు ♦ రార్యులందు
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౫౬

సీ॥ ప్రాణమేగినవెన్క ♦ ప్రతిమానవునిగొప్ప
వల్లకాఁటను గాన ♦ వచ్చుచుండ
నూపిరేగినవెన్క ♦ నుద్యోగములశక్తి
వల్లకాఁటను గాన ♦ వచ్చుచుండ
మృతివహించినవెన్క ♦ సతిసుతాదులప్రేమ
వల్లకాఁటను గాన ♦ వచ్చుచుండఁ
జచ్చిపోయినవెన్క ♦ సౌందర్యములరీతి
వల్లకాఁటను గాన ♦ వచ్చుచుండ
గీ॥ లెక్కఁజూడక వ్యర్థమౌ ♦ దుఃఖములకుఁ
బాత్రులైనట్టి మానవ ♦ మాత్రులవని
స్థిరత రాత్మానుభవసుఖం ♦ బెరుఁగుటెట్లు?
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౫౭

సీ॥ ప్రాణముల్ పోఁగాను ♦ ప్రతిమానవుని గాత్ర
మును బంధుమిత్రులై ♦ నను సహించి
నామస్వరూపముల్ ♦ నాశనంబొనరింప
పతిసుతాదుల నెల్ల ♦ హితవుపరచి
రుద్రభూమికిఁ జేర్చి ♦ ఋణబంధములఁగోసి
మట్టిలోపలఁగల్పి ♦ మగిడివచ్చి
చిన్నపెద్దలుఁజూడఁ ♦ జచ్చి కార్యము లెల్లఁ
జేసి మహాధాత్ములై ♦ గాసిఁజెందు
గీ॥ మానవులు దేహధర్మంబుఁ ♦ గానలేవి
పనికిమాలిన యాతిమాయ ♦ పనులవల్ల
విమల వైరాగ్యసంగతుల్ ♦ వినరు జగతి
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయణార్య! ౫౮

సీ॥ ధనధాన్యములు బంధు ♦ జనములాదిగఁ గల్గు
పరివారమేమియుఁ ♦ బనికిరాక
మిథ్యగాఁజనిపోవు ♦ సద్యోగమునఁగల్గు
ధీరత్వమేమియు ♦ కౄరతరాక
బుద్ధినేరకతప్పు ♦ భక్తిచే నార్జించు
చేవతో నేమియుఁ ♦ జేయలేక
సతిసుతాదులు చెంత ♦ వతిచింతతోఁ జేయు
ఘనరవంబేమియుఁ ♦ గానలేక
గీ॥ యూపిరేగిన వెంటనే ♦ యూరిబైట
రుద్రభూమికిఁ బనిపెట్టి ♦ ఋణముఁదీర్చు
కొఱఁగియుండియు మానవుల్ ♦ స్థిరముఁగనరు
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయణార్య! ౫౯

సీ॥ తల్లిదండ్రులు నక్క ♦ చెల్లెండ్రు బావలు
నన్నదమ్ములు మోద ♦ మందు లెల్ల
నాలుబిడ్డలు సొంత ♦ యత్తమామలు సదా
యసమానురాగులై ♦ మసలు లెల్ల
సకలవిద్యలు మంచి ♦ సఖులు బంధుశ్రేణి
పశుధనంబులు గొప్ప ♦ వసతులెల్ల
జగతిపై స్థావర ♦ జంగమాదులతోడ
నిండి కన్పించు బ్రహ్మాండమెల్లఁ
గీ॥ గన్నుమూసినతోడనే ♦ సున్నయగుచు
మాయమైపోవు సంగతి ♦ మరచి సర్వ
పాపములఁ జేయుచుందు రీ ♦ పాడునరులు
రాజయోగీంద్ర! లక్ష్మమ్మనా ♦ రాయణార్య! ౬౦

సీ॥ ప్రాణముల్ దేహమం ♦ దానియుండఁగ భక్తి
గురునియోగమునందు ♦ గుదురవలయుఁ
గుదిరినంతనె తత్త్వ ♦ మెదయందుఁ దలపోసి
మాయకార్యములెల్ల ♦ మానవలయు
మానినంతనె సర్వ ♦ మాలిన్యములుఁ బోయి
యచలస్వరూపంబు ♦ నందవలయు
నందినంతనె మోద ♦ మంది మానవులెల్ల,
సంతసంబునఁ బూజ ♦ సలుపవలయుఁ
గీ॥ గాని టక్కరివృత్తితో ♦ మేను జెఱచి
మదికి వెతఁ జెంచి జీవించు ♦ మనుజుఁ డెట్లు
నిర్వికల్పసమాధిలో ♦ నిలువఁ గలఁడు?
రాజయోగీంద్ర! లక్ష్మమ్మ నా ♦ రాయణార్య! ౬౧

సీ॥ వేదాంతినని సదా ♦ వాదించినంతనే
యోగమొప్పునె లోన ♦ బాగులేక
యతిపండితుఁడనంచు ♦ మతినెంచినంతనే
మాటలొప్పునె శాస్త్ర ♦ సూటిలేక
భాగ్యవంతుఁడనంచు ♦ భావించినంతనే
చర్యలొప్పునె ద్రవ్య ♦ శక్తిలేక
కడుబలాఢ్యుఁడనంచుఁ ♦ గర్వించినంతనే
పంతమొప్పునె దేహ ♦ పటిమలేక
గీ॥ హఠము సాధింతునని యోగ ♦ మఠముఁజేర
నఖిలవేదాంతసారమై ♦ నట్టిరాజ
యోగమొప్పునె చిచ్ఛక్తి ♦ బాగులేక
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౬౨

సీ॥ రాజయోగినిఁ జూచి ♦ పూజసల్పక మహా
పలుగాకివాక్యముల్ ♦ బలుకుచుండి
గురుభావమునఁగల్గు ♦ గుర్తుఁగాంచక సదా
యాశలోఁబడిపోయి ♦ యడలుచుండి
మనసునిల్కడలేని ♦ మాటలాడుచు ఘోర
విషయానురాగులై ♦ మసలుచుండి
యేకభావముఁ బాసి ♦ యేడ్పు యంతయు వీడి
సర్వదోషములతోఁ ♦ జచ్చుచుండి
గీ॥ సృష్టిఁ గసలేక యాశతోఁ ♦ గష్టమొందు
తెలివిమాలిన యాచార ♦ ములనుజేయు
నరులకేలాగు పరమార్థ ♦ మెరుకపడును?
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౬౩

సీ॥ దేశాటనం బెట్లు ♦ దేహశుద్ధినిఁ జేయు
గురుకటాక్షమున సు ♦ స్థిరతఁగనక
కల్లమంత్రము లెట్లు ♦ కర్మశుద్ధినిఁ జేయు
గురుకటాక్షమున సు ♦ స్థిరతఁగనక
శిలల రూపములెట్లు ♦ చిత్తశుద్ధినిఁ జేయు
గురుకటాక్షమున సు ♦ స్థిరతఁగనక
అడవిలోనుని కెట్లు ♦ లాత్మశుద్ధినిఁ జేయు
గురుకటాక్షమున సు ♦ స్థిరతఁగనక
గీ॥ పిచ్చిలోఁబడి యింద్రియా ♦ పేక్షవలన
మాయపనులిట్లు జేసి యు ♦ మేయమైన
దుఃఖములఁ బొందుచుందు రీ ♦ తిక్క నరులు
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౬౮

సీ॥ నిర్మలాకారమౌ ♦ నిర్గుణబ్రహ్మంబుఁ
గనలేక సన్మార్గ ♦ మునకుఁదప్పి
మోసయుక్తంబైన ♦ వేషముల్ ధరియించి
దుష్టవర్తనలచేఁ ♦ గష్టపడుచు
నస్నసద్భావముల్ ♦ సున్నజుట్టుకపోవ
మంత్రోపదేశమన్ ♦ మాయవలన
గురుధర్మమని శిష్య ♦ వరులసమ్మతిఁ జేసి
పాదతీర్థములిచ్చి ♦ బాధపెట్టు
గీ॥ ఘోరదుర్మార్గమునఁ జొచ్చి ♦ మేరమీరి
సంచరింపుచు సృష్టిగు ♦ ర్తించలేని
నరుని సద్గురువనిచెప్ప ♦ నగవుగాదె?
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౬౯

సీ॥ ఆలయంబులఁగట్టి ♦ యధికుఁడైనంతనే
పరమాత్మ ఘనతత్త్వ ♦ మెరుఁగుటెట్లు?
పుణ్యయాత్రల కేగి ♦ పూజ్యుఁడైనంతనే
పరమాత్మఘనతత్త్వ ♦ మెరుఁగుటెట్లు?
సత్రముల్ గట్టించి ♦ సరసుఁడైనంతనే
పరమాత్మఘనతత్త్వ ♦ మెరుఁగుటెట్లు?
యాగముల్ జేయించి ♦ త్యాగియైనంతనే
పరమాత్మఘనతత్త్వ ♦ మెరుఁగుటెట్లు?
గీ॥ స్థిరముఁ బరికించు గురువర్యుఁ ♦ డెరిఁగినట్టి
శుద్ధమై నిత్యమై సుప్ర ♦ సిద్ధమైన
యాత్మభావంబుఁ దెలియఁడీ ♦ యవనియందు
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రామునార్య! ౬౬

సీ॥ లోఁజూపుఁ జూడక ♦ లోకంబుఁ జూచితే
పలువిధంబుల దుఃఖ ♦ ఫలితమిచ్చు
లోకవృత్తులు మాని ♦ లోఁజూపుఁ జూచితే
దేహమందలి గుట్టుఁ ♦ దెలియవచ్చు
నొకదానిఁ బూని చే ♦ రొకదానిఁ జూచితే
తొట్రుకఁగాకని చెడ్డ ♦ చావువచ్చు
స్థిరముగా నొకదాని ♦ నిరతంబుఁ జూచితే
పరలోకసుజ్ఞాన ♦ మెరుఁగవచ్చు
గీ॥ కాని దానిని వీడి యౌ ♦ ననినదానిఁ
జిత్తమునఁ జేర్చి యిహలోక ♦ చింతఁ గాల్చి
ముక్తిఁ గాంచిన మనుజుండు ♦ ముఖ్యుఁడవని
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రామునార్య! ౬౭

సీ॥ భూలోకమంతయుఁ ♦ బోలించి నుతిఁగొన్న
చక్రవర్తులశక్తి ♦ చలనమయ్యె
నాలోచనలఁజేసి ♦ చాలఁగా సిరిఁగొన్న
మంత్రివర్యులశక్తి ♦ మాయమయ్యె
నుద్యోగములఁజాల ♦ బాధ్యులై పనిఁగొన్న
పరిజనంబులశక్తి ♦ భగ్నమయ్యె
ధరణిసేవ్యముఁజేసి ♦ స్థిరముడే యనుకొన్న
పంటకాపులశక్తి ♦ పతనమయ్యె
గీ॥ నయ్యయో సర్వమిడఁజూసి ♦ యరుగు నప్పు
డేమి మోసుకపోవునో ♦ యెరుక లేని
కష్టనరజన్మమేటికి ♦ సృష్టియందు ?
రాజయోగీంద్ర! లక్ష్మీనా ♦ రాయణార్య ! ౬౮

సీ॥ బాలప్రాయము సాను ♦ కూలంబుగానట్టి
యాటతో సరిపెట్టి ♦ దాటఁబెట్టి
యౌవనంబును స్త్రీల ♦ యాశలోఁబడఁగొట్టి
చింతతో సరిపెట్టి ♦ చిక్కఁబెట్టి
కౌమారమును లోభ ♦ కాంక్షలోఁబడఁగొట్టి
గడనతో సరిపెట్టి ♦ గాసిపెట్టి
వృద్ధాప్యమును రోగ ♦ వృద్ధిలోఁ బడఁగొట్టి
బాధతో సరిపెట్టి ♦ ఖేదపెట్టి
గీ॥ మంచిదశలెల్ల నీరీతి ♦ ముంచఁబెట్టి
మృత్యుముఖమునఁ బడిపోయి ♦ మూల్గిచచ్చు
నరుఁడు సుజ్ఞానమున కెప్పు ♦ డర్హుఁడగును?
రాజయోగీంద్ర! లక్ష్మీనా ♦ రాయణార్య! ౬౯

సీ॥ సంసారమునఁజేరి ♦ సతిసుతాదులఁగోరి
వెతలుబొందినవాఁడె ♦ వెర్రివాఁడు
హంసభావముఁబాసి ♦ హింస నిత్యముఁజేసి
రోగముల్గనువాఁడె ♦ మూఁగవాఁడు
ఘనతత్త్వమును రోసి ♦ తనువుఁ బోషణఁజేసి
మోసపోయినవాఁడె ♦ మొండివాఁడు
దుష్టచిత్తముదోఁచి ♦ సృష్టిభేదముఁజేసి
చచ్చిపోయినవాఁడె ♦ పిచ్చివాఁడు
గీ॥ గాని మనుజులు పరిపూర్ణుఁ ♦ గాంచిరేని
వెర్రిమొదలైన పేర్లుంచి ♦ వెర్రులగుచు
సంతసింతురు పరమార్థ ♦ చింతలేక
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయణార్య! ౨౦

సీ॥ మొదట సంసారంబు ♦ మోసి యేడ్చిన ఖంత
తనయునిపైఁ బెట్టి ♦ తర్లిపోయె
దాని నాతఁడుమోసి ♦ మానక మరికొంత
గూర్చి పుత్రునకిచ్చి ♦ కూలిపోయె
నద్దాని ధరియించి ♦ హద్దుగానక మోసి
యాతనిపుత్రునకిచ్చి ♦ యడఁగిపోయె
నట్టిదానిని నాతఁ ♦ డట్టులో తెగమోసి
సతిసుతాదులకిచ్చి ♦ సమసిపోయె
గీ॥ బహుతరంబులనుండి యీ ♦ బాధఁబొందు
టెఱిఁగి మానవులీమాయ ♦ గురి ధరించి
కూలుచున్నారు పరమాత్మ ♦ గుర్తుఁదప్పి
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయణార్య! ౨౧

సీ॥ తల్లిదండ్రులతప్పు ♦ తనయుఁడై జన్మించె
నాతప్పు మరియొక్క ♦ టాఁడుదయ్యె
నట్టితప్పులరెంటి ♦ కిష్టమౌ రీతిగా
మాయవావులుపెట్టి ♦ న్యాయమంచు
చెప్పి తప్పుడుపెండ్లిఁ ♦ జేసి ఘోరంబైన
కర్మలోఁబడఁద్రోసి ♦ కాళ్లుచాఁచి
పలుగుచర్యలు జూడఁ ♦ దలపెట్టి నీచులై
కపట వర్తనపల్కు ♦ కలిను లవని
గీ॥ మమతఁ జెన్నొంద స్త్రీయంత్ర ♦ మహిమవలన
తప్పువిషయంబులే సదా ♦ చెప్పుకొనుచు
నిలువ నియ్యరు సత్యంబు ♦ నిమిషమైన
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! 22

సీ॥ మనసులో విభ్రాంతి ♦ మానఁజాలక మాయ
కట్టులోఁబడి జన్మ ♦ గుట్టులేక
తల్లియాదిగఁగల్గు ♦ తన కున్నదంతయు
స్వప్నతుల్యమటంచు ♦ జ్ఞప్తిలేక
బుద్ధిలేకేడ్చి యీ ♦ భూమియం దిసుమంత
మోసిపట్టుక వెళ్లు ♦ నాశలేక
తీరని చింతలోఁ ♦ జేరి సౌఖ్యమువీడి
బాధకోర్చుచు దేహ ♦ శోధలేక
గీ॥ పోవుచున్నారు చిత్రమౌ ♦ పోలికలతో
గుణము చెడిపోయి సృష్టిపై ♦ గుర్తుఁదప్పి
మోగమొప్పక యీపాదు ♦ భోగపరులు
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! 23

సీ॥ ముట్టులోపలఁబుట్టు ♦ గుట్టెరుంగని వట్టి
మురికిదేహమున కీ ♦ మురిపెమేల?
నవరంధ్రముల వెంట ♦ ద్రవముజారెడువట్టి
పాడుదేహమున కీ ♦ పదవులేలఁ?
బిల్లలాదిగ వీడి ♦ వల్లకాటికిఁజేరు
తుచ్ఛదేహమున కీ ♦ గచ్చులేలఁ?
జచ్చినఁ దరువాతఁ ♦ బుచ్చిపాసనఁగొట్టు
కుళ్లుదేహమున కీ ♦ కులుకదేలఁ?
గీ॥ నంచు మదియందుఁ దలఁప కీ ♦ యల్పనరులు
క్రూరవృత్తులు జేయుచుఁ ♦ గోరికలను
విడువఁజాలరు త్రిగుణ యా ♦ గడమువలన
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయణార్య! ౭౮

సీ॥ ఆయువెంచక మాయ ♦ కాయంబుఁగని మహా
తుచ్ఛులై సర్వదా ♦ మెచ్చుచుండి
వంచనెంచక మాయ ♦ వర్ణంబుఁగని మహా
యధములై సర్వదా ♦ వదరుచుండి
భారమెంచక మాయ ♦ భాగ్యంబుఁగని మహా
దొంగలై సర్వదా ♦ పొంగుచుండి
క్షేమమెంచక మాయ ♦ క్షేత్రంబుఁగని మహా
మూఢులై సర్వదా ♦ మురియుచుండి
గీ॥ నిత్యవస్తువు గుర్తించు ♦ నీతిఁదప్పి
లోకసుఖముల కింద్రియ ♦ లోలురగుచు
సంతసింతురు దుర్జనుల్ ♦ చింతఁగనుచు
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయణార్య! ౭౯

సీ॥ బూతులోపలఁ బుట్టి ♦ బూతునే చేపట్టు
నరులు బూతులటంచు ♦ నవ్వనేల?
బూతుకై మదిఁబెట్టి ♦ బూతు నిత్యముఁదట్టు
నరులు బూతులటంచు ♦ నవ్వనేల?
బూతుకై యాశించి ♦ బూతు నుపాసించు
నరులు బూతులటంచు ♦ నవ్వనేల?
బూతు లక్ష్యముఁజేసి ♦ బూతులో తనుమాయు
నరులు బూతులటంచు ♦ నవ్వనేల?
గీ॥ బూతు మానవలోక ప్ర ♦ ఖ్యాతిరైన
మూలమూహించి నిజమెంచి ♦ ముదముఁగాంచు
నట్టి సుజ్ఞానమెరుఁగక ♦ యావనియందు
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయణార్య! ౭౬

సీ॥ జాతంబుఁ దెల్పఁగా ♦ భూతంబు నిరసించి
బూతులోఁ బడియుండి ♦ నీతిలేక
మరణంబుఁ దెల్పఁగా ♦ సరిగాదు పొమ్మంచు
శిక్షలోఁ బడియుండి ♦ దీక్షలేక
యోగంబుఁ దెల్పఁగా ♦ బాగుగాదని యెంచి
కట్టులోఁ బడియుండి ♦ గుట్టులేక
సత్యంబుఁ దెల్పఁగా ♦ నిత్యంబు నిందించి
మాయలోఁ బడియుండి ♦ హాయిలేక
గీ॥ మానవులు నిత్య భావంబు ♦ మరచిపోయి
వలయుదానిని దప్పఁగాఁ ♦ దలఁచి మాని
కానిపను లెల్లఁ జేయఁగాఁ ♦ బూనిరకట!
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయణార్య! ౭౭

సీ॥ సారమై ఘనఘటా ♦ ధారమౌ వీర్యంబుఁ
బెక్కురీతుల నష్ట ♦ పెట్టుచుండి
బ్రహ్మ రంధ్రమునందుఁ ♦ బ్రవహించు సద్వీర్య
మతి నష్టమైపోయి ♦ యడలుచుండి
సుస్థిరంబౌ మనో ♦ సుఖమిచ్చు వీర్యంబుఁ
బలువిధంబులఁ బాదు ♦ పరుచుచుండి
ప్రాణ స్వరూపమై ♦ ప్రఖ్యాతిఁ గను వీర్య
మునువ్యర్థ మొనరించి ♦ మురియుచుండి
గీ॥ తుచ్ఛులై యోగసాధనం ♦ బిచ్చు వీర్య
హానిఁ గావించు నశనంబు ♦ మానలేని
మానవులకెట్లు బిందుధా ♦ రణముగల్గు
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౭౮.

సీ॥ స్త్రీయంత్రమున సదా ♦ చిక్కియేడ్చుచు దేహ
మోక్ష మెంచక పాప ♦ దీక్షఁబూని
లోక చింతను దూరి ♦ పాకులాడుచు మనో
స్థిర మెంచ కార్య సం ♦ కరముఁ బూని
సర్వంబుఁ దనదంచు ♦ సంగ్రహించుచు ముందు
గతిఁగాన కతిమూఢ ♦ మతముఁ బూని
పాడువృత్తులుఁజేయఁ ♦ బాట్లు బొందుచు లోక
సృష్టిఁగాంచక కర్మ ♦ నిష్ఠఁ బూని
గీ॥ బుద్ధి చాలక వెతఁగాంచి ♦ హద్దుఁదప్పి
వివరమెంచని మనుజుఁడీ ♦ యువనియందు
మోసపోవును హీనసం ♦ తోషియగుచు
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౭౯

సీ॥ ధరణియం దతిహీనదశఁ ♦ గాంచునదియైన
మంకుదైనను సదా ♦ మాయదైనఁ
గుల్లుదైనను మహా ♦ కుష్ఠరోగవుదైన
మోటుదైనను ♦ బొట్టకూటిదైన
దొంగదైనను నడ్డి ♦ వంగియున్నదియైన
నెండిపోయినదైన ♦ మొండిదైన
వంటరానిదియైన ♦ నతిపాపియైనను
గష్టపెట్టునదియుం ♦ గెట్టిదైనఁ
గీ॥ బుడమియం దాఁడురూపమై ♦ పుట్టెనేని
నమ్మిపాలేరు తనముకై ♦ నరుఁడొకండు
సిద్ధపడికాఁచుకొనియుండు ♦ సిగ్గులేక
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౮౦

సీ॥ వేదశాస్త్రములెల్ల ♦ బోధఁ గాంచినఁ గాని
తప్పుమార్గమువీడు ♦ ధన్యుఁడేఁడి?
సర్వతీర్థములలో ♦ స్నానమాడినఁగాని
తప్పుమార్గము వీడు ♦ ధన్యుఁడేఁడి?
పలుమతంబులునేర్చి ♦ పంతమాడినఁగాని
తప్పుమార్గము వీడు ♦ ధన్యుఁడేఁడి?
తలక్రిందుగాఁబెట్టి ♦ తపముఁ జేసినఁగాని
తప్పుమార్గము వీడు ♦ ధన్యుఁడేఁడి?
గీ॥ దేహమునఁ బ్రాణ ముండఁగాఁ ♦ దెలిసితప్పు
మార్గమునువీడి వర్తించు ♦ మహితయశుఁడు
కానఁగారాఁడు యిహలోక ♦ కాముకులలో
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౮౧

సీ॥ రుచిఁజూడఁజిహ్వకు ♦ ఋణము లేనిది గోరి
విడువఁ జేంద్రియశక్తు ♦ లడఁచు టెట్లు?
వాసనకై ముక్కు ♦ కాశలేనిది గోరి
విడువఁ జేంద్రియశక్తు ♦ లడఁచు టెట్లు?
సుందరంబును గన్ల ♦ జూడరానిది గోరి
విడువఁ జేంద్రియశక్తు ♦ లడచు టెట్లు?
వినఁగర్ణములకైనఁ ♦ బనికిరానిది గోరి
విడువఁ జేంద్రియశక్తు ♦ లడచుఁ టెట్లు?
గీ॥ కలుష సంసారదుఃఖ సం ♦ కలితమైన
విషయ సుఖవాంఛ మనుజుండు ♦ విడువఁజాల
కవని పై వ్యర్థుఁడగుచుండు ♦ నక్కటకట?
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయణార్య! ౧౨
సీ॥ మంత్రముల్ సాధించు ♦ మనుజోత్తమునిశక్తి
స్త్రీయంత్రమునఁ జిక్కి ♦ శిథిలమగుచు
రాజ్యభారముఁ బూను ♦ రాజోత్తమునిశక్తి
స్త్రీయంత్రమునఁ జిక్కి ♦ శిథిలమగుచు
ధనముతోఁ దులఁదూగు ♦ ఘనమానవునిశక్తి
స్త్రీయంత్రమునఁ జిక్కి ♦ శిథిలమగుచు
జగమంతటిని గెల్చు ♦ మగవాని ధీశక్తి
స్త్రీయంత్రమునఁ జిక్కి ♦ శిథిలమగుచు
గీ॥ మాయమైపోవు సంగతి ♦ మరచిపోయి
క్రూరులై కామ సంతోష ♦ దూరులగుచుఁ
దిరుగు నరులకు సుజ్ఞాన ♦ మెరుకపడునె?
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయణార్య! ౧౩

సీ॥ వారముల్ మాసముల్ ♦ వత్సరంబులు గూడ
కాంతపైఁ జింతతోఁ ♦ గడచిపోవు
వేదముల్ వాదముల్ ♦ మోదంబులును గూడ
కాంతపైఁ జింతతోఁ ♦ గడచిపోవు
మంత్రముల్ యంత్రముల్ ♦ తంత్రంబులును గూడ
కాంతపైఁ జింతతోఁ ♦ గడచిపోవు
రాగముల్ భోగముల్ ♦ రోగంబులును గూడ
కాంతపైఁ జింతతోఁ ♦ గడచిపోవు
గీ॥ వంతమునకేమి నిల్వ దీ ♦ యవనియందుఁ
బరమవైరాగ్యమొక్కటే ♦ స్థిరముఁగాంచుఁ
గాన మానవుఁ డద్దానిఁ ♦ బూనవలయు
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౮౪

సీ॥ సంతోషపడి తుచ్ఛ ♦ సంసారమునఁ జేరి
మనమునం దత్యంత ♦ మమతఁగాంచి
యీషణత్రయముచే ♦ గాసిల్లిమాయలోఁ
బడి కర్మకాండతో ♦ బాధఁగనుచుఁ
పెను దోషములకంటు ♦ కొని విషంబులనెల్ల
మ్రింగి రోగములచే ♦ భంగమొంది
విఫలులై చనిపోవు ♦ విద్యఁ గైకొని సత్య
మెట్టిదో చూడలే ♦ నట్టివరుల
గీ॥ కెట్లు హఠయోగమున వాయు ♦ పట్లు దెలియు
శుష్కవేదాంత వాక్యముల్ ♦ ముష్కరముగఁ
బల్కి గర్వించు నజ్ఞాన ♦ భ్రాంతిగాని;
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౮౫

సీ॥ పుట్టి చచ్చుటఁబాప ♦ పుణ్యంబు లిడుమాయో
మహిమచే నుప్పొంగు ♦ మనుజులెల్ల
సకలసౌభాగ్యముల్ ♦ సంగ్రహించెడు మాయో
మహిమచే నుప్పొంగు ♦ మనుజులెల్ల
నుద్యోగ శక్తి నీ యైశ్వర్యము ♦ డిడుమాయ
మహిమచే నుప్పొంగు ♦ మనుజులెల్ల
సుఖ దుఃఖములరెంటి నొకరీతి ♦ నిడు కాల
మహిమచే నుప్పొంగు ♦ మనుజులెల్ల
గీ॥ భ్రమసి ధర్మార్థకామ మో ♦ క్షములటంచు
వెలఁదులను గూడి మితిలేని ♦ వెతలఁ జెంది
ఘటముఁజెడగొట్టుచున్నారు ♦ హా తఱఁగనక
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౮౬
సీ॥ అగ్ని సంపర్కమే ♦ యాకలి శిరముగా
మదవతి కూటమే ♦ హృదయముగను
ఘనకార్య చింతలే ♦ జ్ఞానేంద్రియములుగా
నవికొన్ని కర్మేంద్రి ♦ యములుగాఁగ
మెరుకఁగల్గిన పనుల్ ♦ నరములెమ్ములుగాఁగ
కల్లచేష్టలు రక్త ♦ నాళ్లుగాఁగ
హానివృద్ధులు లెక్క ♦ లేని రోమములుగా
నిహలోక భ్రాంతియే ♦ దేహముగను
గీ॥ మానవాకారమై సదా ♦ మాయఁజేయు
నాశ రూపంబు గుర్తించి ♦ కోసివేయు
పురుషసింహుండె యోగ సం ♦ పూర్ణుఁ డవని
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౮౭

సీ॥ తల్లిదండ్రులు చచ్చి ♦ వల్లకాటికిఁ జేరు
ఎరిఁగి యంతటిలోనె ♦ మరచిపోయి
సంసారమునఁ జొచ్చి ♦ చచ్చిరొక్కొయుఁ గూలు
ఎరిఁగి యంతటిలోనె ♦ మరచిపోయి
మాయకార్యములెల్ల ♦ మట్టిలోపలఁ జేరు
ఎరిఁగి యంతటిలోనె ♦ మరచిపోయి
సర్వభాగ్యంబు లీ ♦ యుర్వియందే విడు
ఎరిఁగియంతటిలోనె ♦ మరచిపోయి

గీ॥ ద్రవ్యమార్జించుటుత్తమ ♦ ధర్మమంచు
నాశ విడక రిత్త సం ♦ తోషములకు
బద్ధులగుదురు మానవుల్ ♦ హద్దుఁదప్పి
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౮౮

సీ॥ ఒక ప్రాణికొఱకు వే ♦ రొకటి గ్రాసముఁ జేర్చి
యుంచు మృగంబు లీ ♦ యుర్విఁ గలవె?
యొక ప్రాణికొఱకు వే ♦ రొకటి గ్రాసముఁ జేర్చి
యుంచెడు పక్షు లీ ♦ యుర్విఁ గలవె?
యొక ప్రాణికొఱకు వే ♦ రొకటి గ్రాసముఁ జేర్చి
యుంచు వృక్షంబు లీ ♦ యుర్విఁ గలవె?
యొక ప్రాణికొఱకు వే ♦ రొకటి గ్రాసముఁ జేర్చి
యుంచెడు జీవు లీ ♦ యుర్విఁ గలవె?

గీ॥ కాని మానవు లద్దానిఁ ♦ బూనివట్టి
భ్రాంతిలోఁబడి సంసార ♦ చింతఁబొంది
కూలుచున్నారు సృష్టిపై ♦ గుర్తు లేక
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౮౯

సీ॥ పలు మోసముల కంటు ♦ బడి లంచములు బట్టి
విధవ తీర్పులు జేయు ♦ నధముఁడొకఁడు
బీద వాండ్రను బట్టి ♦ పీడించి తుచ్ఛమౌ
కార్యముల్ జేయించు ♦ కఠినుఁడొకఁడు
ఇరుపక్షముల న్యాయ ♦ మరయనేరక క్రోధ
వంతుఁడై వాగు దు ♦ రంతుఁడొకఁడు
మాయా వినోదియై ♦ మహిమఁ జూపుచు నోటి
దూలకై తిట్టు దు ♦ శ్శీలుఁడొకఁడు
గీ॥ ఇట్టి నీచులు ధరణిపైఁ ♦ గట్టుఁదప్పి
చెనఁటి యుద్యోగమునఁ జాల ♦ ఘనతఁజూపి
సంతసింతురు సన్మార్గ ♦ చింతలేక
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౯౦

సీ॥ ఆచారములు చచ్చి ♦ యతినీచములు హెచ్చి
కరువు చిగిర్చెడి ♦ కాలమయ్యె
నజ్ఞానమును దాల్చి ♦ సుజ్ఞానమును గాల్చి
మేలు కోర్వని దుష్ట ♦ కాలమయ్యె
సృష్టిసర్వము మారి ♦ నష్టముల్ చేకూరి
గోలగల్గెడు చెడ్డ ♦ కాలమయ్యె
కుల వృత్తు లిలదాగి ♦ వెలపైకి చెలరేగి
కష్ట మబ్బెడు పాడు ♦ కాలమయ్యె
గీ॥ నయ్యయో! యిప్పుడేయిట్టు ♦ లయ్యె జగతి
ముందికెటువంటి గొప్పచే ♦ టొందవలెనో?
తెలిసి తెలియఁగఁ జాలరీ ♦ పలుగు నరులు
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౯౧

సీ॥ అవనిపై నరులయం ♦ దతిహీనుఁడైనను
సర్వ విద్యలుఁగల్గు ♦ సరసుఁడైనఁ
బనికిమాలిన వట్టి ♦ చెనఁటివాఁడైనను
ఘన శాంతుఁడౌఁగొప్ప ♦ ధనికుఁడైనఁ
జోరుఁడైనను సదా ♦ చారుఁడైనను మహా
రోగియైనను మంచి ♦ భోగియైనఁ
మూలమెంచని వట్టి ♦ మూర్ఖ చిత్తుండైన
వాసికెక్కిన ధైర్య ♦ వంతుఁడైన
గీ॥ నెట్టివాఁడైన సృష్టియం ♦ దెరుక జెందిఁ
మనసు నిలుపుట కొకవిద్య ♦ మహిని గలదు
గానియద్దాని మానవుల్ ♦ గాంచు టరుదు
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౯౨
సీ॥ ప్రతి దినంబును కర్మ ♦ తతి యందుఁ దేలుచు
గాసిఁ జెందుట మహా ♦ మోసమంచుఁ
జింతలోఁ బడి నిత్య ♦ మింతికై దుఃఖించి
చచ్చిపోవుట మహా ♦ తుచ్ఛమంచు
వ్యర్థమౌ కార్యముల్ ♦ సార్థకంబుగ నెంచి
చక్కఁ జేయుట మహా ♦ దుఃఖమంచు
సృష్టిపై వస్తువుల్ ♦ దుష్ట భోజ్యంబుగాఁ
జేసి మ్రింగుట మహా ♦ దోషమంచు
గీ॥ సర్వమోహంబులను వీడి ♦ సన్యసించి
కష్టతరమైన బ్రహ్మాండ ♦ సృష్టిఁ దెలిసి
స్థిరముఁ గాంచిన పురుషుఁడే ♦ పరమగురుఁడు
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౯౩

సీ॥ నిద్రలో భద్రంబు ♦ నిజముగా నెరిఁగితే
మాయ విద్యలు నేర్చి ♦ మసలనేల?
తనువులో బంగారు ♦ ఘనయోగ మెఱిఁగితే
నితర సువర్ణంబు ♦ వెతుకనేల?
ఆధారమున వాయు ♦ సాధనం బెఱిఁగితే
నాఁడువాండ్రను జేరి ♦ వేఁడనేల?
జిహ్వాగ్ర చాంచల్య ♦ సంహార మెఱిఁగితే
ఘోరమగా రుచులెల్లఁ ♦ గోరనేల?
గీ॥ కల్ల సన్న్యాస వృత్తిచే ♦ గాసిఁజెంది
మతులు జెడిపోయి భ్రష్టులై ♦ మమతఁగాంచు
మానవుల కెట్లు పిండాండ ♦ మహిమ దెలియు?
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయణార్య! ౬౮
సీ॥ తనువులోపలఁ దప్పు ♦ దాచి యుంచినఁగాని
నడివీధిలో నిల్చి ♦ నవ్వుచుండు
బట్టచాటున సిగ్గుఁ ♦ బెట్టి యుంచినఁగాని
బైట లోకుల కండ్లఁ ♦ బడుచునుండు
మదిలో రహస్యంబు ♦ మఱుఁగు పర్చినఁగాని
యింటిపైనుండి చా ♦ టించుచుండు
ఘటములో రోగముల్ ♦ గప్పిపుచ్చినఁగాని
మంచ మెక్కించి వా ♦ దించుచుండు
గీ॥ జగతిపై నెల్లపను లిట్లు ♦ జరుగుచుండ
మఱుఁగుఁ జేయుట మనుజుని ♦ తరముగాదు
కాన జ్ఞానంబు సమకూర్పఁ ♦ బూనవలయు
రాజయోగీంద్ర! లక్ష్మణా ♦ రాయణార్య! ౬౯

సీ॥ అతి హేయమును గూడ ♦ నతి శుభ్రమనిపించు
నది యాశమూలమహా ♦ నవసరంబె
అతి కష్టమును గూడ ♦ నతిసౌఖ్యమనిపించు
నది యాశమూలమహా ♦ నవసరంబె
అతి ఘోరమును గూడ ♦ నతిధర్మమనిపించు
నది యాశమూలమహా ♦ నవసరంబె
అతి నీచమును గూడ ♦ నతి ఘనంబనిపించు
నది యాశమూలమహా ♦ నవసరంబె
గీ॥ అఖిల నీతి విశారదు ♦ నైనఁగాని
పరమ నిర్భాగ్యుఁడైన దు ♦ శ్చరితు జేర్చి
స్తవముఁ జేయించునదిగూడ ♦ నవసరంబె
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౯౬

సీ॥ పూర్వ కవీశ్వరుల్ ♦ పూర్తిఁ జేసిన కావ్య
నిచయంబులను వదా ♦ నిందఁ జేసి
వెనుకటి శబ్దముల్ ♦ వెదకి బూతు లటంచు
దిద్ది భావములెల్ల ♦ రద్దుఁ జేసి
సకల లక్షణశాస్త్ర ♦ సారంబుగల యాది
కవి చరిత్రములట్టె ♦ గాసిఁ జేసి
ఘనపురాణములెల్లఁ ♦ గల్పితంబుగ నెంచి
మదికిఁ దోచినరీతి ♦ మార్పుఁ జేసి
గీ॥ సరసమగు వాక్యములుకొన్ని ♦ సంగ్రహించి
ధరణిపై పెద్ద దిడ్డ గ్రం ♦ థము లొనర్చు
వట్టిమారాధులు కవులైరి ♦ తుట్టతుదకు
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౯౭

సీ॥ సూర్య చంద్రులు మాయ ♦ సృష్టిసర్వము మాయ
ధన ధాన్యములు మాయ ♦ తనువుమాయ
అఖిల కర్మలు మాయ ♦ యవనీశ్వరులు మాయ
యుద్యోగములు మాయ ♦ విద్య మాయ
తల్లిదండ్రులు మాయ ♦ తగులాటములు మాయ
పనులన్నియును మాయ ♦ ఫలము మాయ
సర్వజీవులు మాయ ♦ సంసార మతిమాయ
పతిసుఖంబులు మాయ ♦ గతులు మాయ
గీ॥ దృశ్యకార్యంబు లన్నియు ♦ దుఃఖమగుచు
మాయగాఁ బోవు సంగతి ♦ మరచిపోవు
మానవుల జన్మ మతిమాయ ♦ మాయ మాయ
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౯౮

సీ॥ ప్లేగు మహావ్యాధి ♦ బాగుగా జగతియం
దూళ్లు కొన్నిఁటి మొత్త ♦ మూడ్చుచుండె
కలరా మశూచి కం ♦ బులు చాల వ్యాపించి
నరులఁ గొందరి నష్ట ♦ పరుచు చుండె
సుఖరోగములు పెక్కు ♦ రకములై కాన్పించి
పడుచు వాండ్రను నేల ♦ కడఁచు చుండె
ఇన్ఫ్లుయంజా జ్వరం ♦ బింటింట వర్తించి
పిన్న పెద్దల మృత్యు ♦ వెన్నుచుండె
గీ॥ నక్కటా లెక్కలేనియా ♦ యధికమైన
రోగముల కాదిఁ దెలియరీ ♦ భోగపరులు
తుచ్ఛ సుఖముల కాశించి ♦ మెచ్చుకొనుచు
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౯౯

సీ॥ ఘోరమౌ వ్యాధిచే ♦ కూరి ధీరంబైన
తనుశక్తిఁ ద్రుంచి ♦ పైకొనక ముందె
వైద్యులందరుఁ జేరి ♦ వర్ణింపుచును వేయు
చెడు విషంబులు నోటఁ ♦ బడక ముందె
బంధుమిత్రులు గొప్ప ♦ బాధఁజెందెదు తన్నుఁ
గని విచారించెదు ♦ గతికి ముందె
ఆలి యాధారంబు ♦ లడిగి యేడ్చెడు పెద్ద
గల్లంతు లింటిలోఁ ♦ గాక ముందె
పొరుగువారలు చచ్చి ♦ పోవునం చూహించి
మూతిఁద్రిప్పెడు భావ ♦ ములకుముందె
మంచి చెడ్డలుఁ జూడు ♦ మంచు విప్రులు చెప్ప
తులసి తీర్థఁపు కోరి ♦ కలకు ముందె
కాళ్లు పైకెగలాగి ♦ నాళ్లు గుండెకుఁజేరి
కంఠ సంకుచితంబుఁ ♦ గనక ముందె
పలువురు యోజించి ♦ పంచఁ బెట్టఁగ నవ్వి
జగతి సర్వము వీడి ♦ చనక ముందె
పీనుగంచును జనుల్ ♦ భీతిఁజెందుచుఁ జూడఁ
గడఁగి బాధలుచాలఁ ♦ బడక ముందె
గీ॥ యీషణత్రయ దోష వి ♦ నాశమొంద
సద్గురునిఁజేరి ముక్తికై ♦ సంభ్రమించి
నిరత మాత్మావలోక సం ♦ భరితుఁడగుచు
గతినిఁ బరికించు నతని కీ ♦ వెతలు గలవె?
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౧౦౦

సీ॥ ఆంధ్రభాషను రసం ♦ బధికంబులేదంచుఁ
దలఁచి పీడక సుఖా ♦ తథ్యమైన
పంచభూతములచేఁ ♦ బరగు నీ ఘన సృష్టి
పరిశీలనమువల్ల ♦ దొరకినట్టి
దృశ్యార్థములుబెట్టి ♦ దృష్టాంతముగ రాజ
యోగంబునం దను ♦ రాగ మమర
సీసపద్యములుగాఁ ♦ జేసి కృష్ణంరాజు
తెలియఁజేసిన యోగ ♦ ఫలితములను
గీ॥ గాంచు పరమార్థజ్ఞాన సం ♦ కలితులైన
పుణ్యపురుషుల స్తవరత్న ♦ గణ్యమెల్ల
నవధరింపుము దయఁగల్గి ♦ యాదరముగ
రాజయోగీంద్ర! లక్ష్మినా ♦ రాయణార్య! ౧౦౧

గద్య

ఇది శ్రీలక్ష్మీనారాయణ యోగీశ్వర గురుకరుణా కటాక్ష
నిరీక్షణ సంలబ్ధ హఠయోగసామ్రాజ్య ధురంధ
రాపస్తంబసూత్ర వసిష్ఠగోత్ర పవిత్ర క్షత్రియ
వంశోద్భవాయుర్వేద సుధానిధి పొత్తూరి
కృష్ణంరాజయోగి ప్రణీతంబైన
తత్త్వలక్ష్యార్ణవము నందు
ప్రథమోద్దేశము.

శ్రీ మదస్మద్గురు పరబ్రహ్మార్పణమస్తు.




# తత్త్వలక్ష్యార్ణవము.

## ద్వితీయోద్దేశము.

శ్రీయుత రాజయోగ హార ♦
సిద్ధులొనర్చు మనోదృఢత్వముఁ
వాయు పరిశ్రమంబెఱిగి ♦
వర్తిలు సద్గురు దత్తమైన యా
దాయము పెంపుఁగాంచు ఘన ♦
ధర్మనిరూఢియుఁ గల్గి ధాత్రిలో
మాయను గెల్చునట్టి మత ♦
మారయు రాదటె! వెర్రిజీవమా! ౧

ఉ॥ ఆదిని నొక్కటౌచుఁ గన ♦
నందులొ మూఁడును మూఁడు మూఁడునై
మీఁదట నారు నైదు మరి ♦
మేలగు నైదుతో నిర్వదైదునై
బోధ నెరుంగు మానవులఁ ♦
బొందినయోగ మహావిభూతినై
సాధు జనానుకూల మగు ♦
సారమెరుంగుము వెర్రిజీవమా! ౨

ఉ॥ సృష్టిని సర్వజీవులకు ♦
సూర్య సుధాకరు లిర్వురుండఁగా
నష్టము చర్చఁజేయఁగ వి ♦
నాశ మనేక విధంబులైతగన్
గష్టపు దేహయంత్రమున ♦
గాలము పోవుట హంసనూత్రమే
స్పష్టముఁ జేయుచుండెను వి ♦
చారణ సల్పుము వెర్రిజీవమా! 3

ఉ॥ తూటులు తొమ్మిదింటికినిఁ ♦
దుష్ప్ర వదల్చుచు నింద్రియాది జం
ఝూటము తోడ సూక్ష్మమగు ♦
చర్మసమన్విత బాటవెంబడిన్
వాటముఁగల్గి నిత్యమును ♦
వర్తన సల్పుచు దేహయంత్రమున్
ఘాటిగఁ బెంచి త్రుంచు ఘన ♦
తత్త్వ మెరుంగుము తుచ్ఛజీవమా! ౪

ఉ॥ తొమ్మిది రంధ్రములఁగలిగి ♦
తోలును మాంస మలాదియుక్తమౌ
నెమ్ములగూటి కందమున ♦
కెన్నియొ వస్తువులుంచి నిత్యమ
న్నమ్మకచే నసత్యనట ♦
నంబొనరించి విశేషచింతతో
నిమ్మహి సంతయున్వదలి ♦
యేగు టెరుంగవు; వెర్రిజీవమా! ౫

ఉ॥ ఆసన ముద్రయోగముల ♦
నాదర మొప్పగ నభ్యసించి సం
తోషముఁ గల్గుమానసము ♦
తోడ మెలంగు శరీరజన్యమౌ
దోషముఁ ద్రుంచఁ జప్పిడిని ♦
దొల్లిటిరీతి భుజింపుచు న్మహా
మోసపు గండముల్ గడచి ♦
మోదముఁ గాంచవె! మాయజీవమా! ౬

చ॥ ఘనమగు స్వర్ణరత్నములు ♦
గల్గిన దేహమటుంచి తుచ్ఛమౌ
కనకముఁగోరి నిత్య మతి ♦
కష్టముఁగాంచుచు నింద్రియాదుల
మనమునకంటఁగట్టి యభి ♦
మానముద్రుంచి చరించి నీల్గు నీ
పనితర మిట్టులుండె నదు ♦
పాయమెరుంగని వెర్రిజీవమా! ౭

ఉ॥ విత్తముఁజేర్చనెంచి బహు ♦
వింతగు కార్యములెల్లఁ జేయుచున్
జిత్తమునందు నిత్యమతి ♦
చిక్కులఁబొందుచు దుఃఖవంతమా
పెత్తనమాచరించి తగు ♦
పేరు గణించఁగనెంచి న్యాయమా
నుత్తమ మార్గముణ్ మరచి ♦
యూరకపోకు వివేకజీవమా ! ౮

ఉ॥ పుట్టినతోడనే నరుఁడు ♦
పూర్తిగ నేడుపునేర్చుఁ బ్రేమచే
జుట్టు ననేకులుండఁగను ♦
జూడక చక్కని నిద్రనేర్చు పై
మట్టునెఱుంగలేక మతి ♦
మాలిన రీతిగ నవ్వనేర్చు నీ
పుట్టు గుణత్రయంబునకుఁ ♦
బొందదు సద్గురుబోధ జీవమా! ౯

చ॥ ఎనుబదినాల్గులక్షలని ♦
యెంచిన జీవమహార్ణవంబునన్
మనుజుఁడై యగ్రజన్ముఁడని ♦
మాటలశక్తిఁ దలంచిచూచి నీ
మనమునఁజింతఁజేసి యను ♦
మానముఁ జెందక యద్వితీయమౌ
ఘనమగు బ్రహ్మతేజమును ♦
గాంచి సుఖించు వివేక జీవమా! ౧౦

ఉ॥ మాంసము నెన్నఁడైనఁ దిన ♦
మానసమందుఁ దలంపుఁ గల్గినన్
సంశయమెల్లమాని యతి ♦
సాహసవృత్తిని స్వాంతదేహమం
దాశగొలందిఁ గోసి ముద ♦
మందగఁ వండి కుటుంబమెల్ల సం
తోషముతోడఁ దిన్నపుడు ♦
తోఁచును హింసఫలంబు జీవమా! ౧౧

ఉ॥ కంటక మల్పమైనఁ దన ♦
కాలికినాటిన బాధకోర్వలే
కింటికిఁబోయి మొరలిడి ♦
యేడ్చి విషాదముఁ జెందువాఁడు తా
కంఠము ద్రుంచి చంపి కుతు ♦
కంబుగఁ బ్రాణుల మాంసఖండముల్
వంటలుచేయుచున్ మనసు ♦
వచ్చినరీతి భుజించి జీవులం
దంటెను గాఢవేదనల ♦
నారయలేడశనాభిలాషియై. ౧౨

ఉ॥ తప్పని సత్యమౌ ప్రకృతి ♦
తత్త్వమెరుంగక స్వచ్ఛమైన యీ
పప్పులు దుంపలు న్మరియుఁ ♦
బండ్లును గాయలు శాకలాదిగాఁ
జప్పిడి యంచునెంచి తినఁ ♦
జాలక దుష్టరుచుల్ మరింగి యుం

రొప్పదటంచు నార్యులతి ◆
  తాలోచనచేసి వచించ మానలే
కప్పని వృద్ధిఁజేయఁ మదిఁ ◆
  కాదరమొప్పఁగ మాయ భక్తికై
తిప్పలుఁ బొంది భాగ్యములఁ ◆
  దీరని బాధలఁ బెట్టు దుష్టులీ
తప్పులెరింగి యాత్మపర ◆
  తత్త్వముఁ గాంచి తరించు టెట్లొకో! ౧౮

ఉ॥ మానవ నిర్మితంబులగు ◆
  మైల పదార్థములన్ భుజింప కిం
పైన ఫలాదు లాత్మహిత ◆
  పథ్యముగాఁ గొని ముక్తికై మనో
హానిఁ దొలంగ దేహమును ◆
  హాంప నెరింగి స్థిరంబుఁ జేసినన్
మానవె? దుర్గుణంబు లను ◆
  మానవ మింకేల? వివేక జీవమా! ౧౯

ఉ॥ సద్గురుమూర్తిపైఁ గలుగు ◆
  సంశయమూరోగ మడంచి భక్తిచే
సద్గతిఁగోరి శిష్యుఁడతి ◆
  సంతసమొప్పఁగ సేవసల్పి యీ
గద్గద భేదవాదముల ◆
  గందరగోళ సముద్రమీదినన్
సద్గుణ వృద్ధిఁగల్గి స్థిర ◆
  సౌఖ్యముఁ గాంచు మహావిలాసుఁడై. ౨౦

చ॥ ధనముఁగడించి యుంచుటకు ♦
ధారుణియెల్ల మహాపవిత్రులౌ
మనుజులకై సృజించెఁ బర ♦
మాత్ముఁడటంచుఁ దలంచు మోసమౌ
తనువు ధరించి నిత్యమును ♦
దుష్పలనార్చి భక్షింతు మానవుల్
ఘనమగు చిత్తవైరాగ్యమును ♦
గాంచి సుఖించి తరింతు రెట్లొకో! ౨౧

ఉ॥ వేషముఁజూచి మూర్ఖులతి ♦
వేడుకఁజెంది నుతింప సాధుసం
భాషణఁజేయుచుం దురిత ♦
భావము మానసమందుఁ గల్గి సం
తోషముఁ గాల్చివేయుచని ♦
తోఁ నిరతంబుఁ జరించి మాయచే
భూషితులౌ నరాధముల ♦
బూటకముల్ వినఁబోకె జీవమా! ౨౨

ఉ॥ చెడ్డనరుల్ ఘనంబులని ♦
చెప్పెదు షాదుమిరాయి లాదిగా
నడ్డములేక మ్రింగి యుదధి ♦
కంబగు రోగములన్ సృజించి యా
గడ్డగు బాధయందుఁ బడి ♦
గందరగోళముఁ జేసి యేడ్చుచున్
బిడ్డల కంటఁగట్టి గతి భిన్న ♦
మొనర్చి హరింతు రక్కటా! ౨౩

చ॥ అభయము మొసంగు గ్రంథముల ♦
కర్థమెరుంగుదు మంచు మానవుల్
సభ లొనరించి యిష్టమగు ♦
సంగతులన్నియుఁ జర్చఁజేసి యా
విభవముచేఁ బ్రమత్తులయి ♦
విత్తముఁజేర్చి హరించుచు న్మహా
శుభమిదు దేహయంత్రమును ♦
నున్న యొనర్తు రిదేమి పాపమో! ౨౪

ఉ॥ ఆకుల నెప్పుడుం దినుచు ♦
నాయువు లెస్సగ నుంచవచ్చు బల్
భీకరమైన సింహముల ♦
బిడ్డలరీతి నొనర్పవచ్చు నీ
లోకుల నందఱిం దనకు ♦
లోఁబడిఁ జేయఁగవచ్చుఁ గాని పల్
పోకలుఁ బోవు మానసముఁ ♦
బొందికఁ జేయ నసాధ్యమేరికిన్. ౨౫

ఉ॥ వాటముగల్గు గుబ్బలును ♦
వాసినిఁ గాంచు ముఖారవిందముం
మాటలలో పసందుగని ♦
మానినియందు మహానురాగుఁడై
కూటమిఁగోరి చిత్త మను ♦
కూలముఁజెంద నుతించి నిత్యముం
బోటివశంబుఁజొచ్చి పర ♦
భోగముఁబాయు నరుండు మూఢుఁడై. ౨౬

ఉ॥ యోగము చెల్లఁజేసి పర ♦
యోచనలన్నియు భిన్నపర్చి యీ
భోగములెల్లఁ ద్రుంచి తను ♦
పొందిక మంటనుగల్పి కామమున్
రాగముతోడ మోహమును ♦
రమ్యతరంబుగఁ జేర్చి ఘోరమౌ
రోగములన్ సృజించు భగ ♦
రూఢి నెరుంగుట సాధ్యమా! భువిన్. ౨౭

మ॥ పరలోకంబున కేగు వేళ మదిలోఁ ♦
బల్మారు వేధించు నీ
పురదారాదులఁగాంచి మోసకరమౌ ♦ ।
పుత్రార్థ విభ్రాంతిచే
స్థిరభోగంబు గతింపఁజేయుటకునై ♦
చీకాకు గానేల నే
త్వరలో సద్గురుఁజేరి ముక్తిఁగనవే ♦
తత్త్వార్థివై జీవమా! ౨౮

శా॥ సారంబై పరిశుద్ధమై యచలమై ♦
సద్రూపమై ముక్తికా
ధారంబై కడుమోదమై ఫలితమై ♦
ధర్మార్థమై దివ్య శృం
గారంబౌ గురుమూర్తివంతమెదలో ♦
గన్పట్టి యోంకారమున్
జేరంగల్గు మహా విభూతికొరకై ♦
చింతింపవే! జీవమా! ౨౯

శా॥ ఆధారంబును జక్కఁజేసి ఘనమౌ ♦
నత్యాశ ఖండించి బల్
మోదంబందఁగలేక బుణ్యమనచే ♦
మోహాది సంసర్గతో
వేదాంతంబును రోసి యోగజపముల్ ♦
విభ్రాంతులై జేయుచున్
బాధం జెందుచుఁ గూలుచుంటి రిల సం ♦
బంధాత్ములౌ మానవుల్. 30

ఉత్సా॥ సూర్యకాంతిఁ బడకముందు ♦ శుద్ధమైన నీటియం
దార్యమతముఁ బూని స్నాన ♦ మాచరింపుచు న్మహా
వీర్యవంతమైన యోగ ♦ విద్య సిద్ధిఁ గాంచి నీ
ధైర్యశక్తివల్ల మాయ ♦ దాటి చూడు! జీవమా! 3౧

ఉత్సా॥ మానసమును శుద్ధపరచి ♦ మాయ దెలియనేర కీ
మేనుశాశ్వతంబటంచు ♦ మెచ్చి పాడువృత్తులన్
మానలేక చేసి కాల ♦ మహిమవల్ల భూమిపై
హానిఁ జెంది బోర్లఁబడక ♦ పోయిఁగనవె! జీవమా! 3౨

ఉత్సా॥ మాయబాటఁబట్టి తప్పు ♦ మాటలాడి నిత్యమున్
జేయరాని కార్యములను ♦ జేసి బాధఁ గాంచి నీ
న్యాయతత్త్వమెరిఁగి చూచు ♦ నేర్పులేని మానవుల్
కాయశుద్ధిఁ జేసి ముక్తిఁ ♦ గాంచు టెట్లు? జీవమా! 33

మత్తకోకిల॥ తమల పాకులయందు గన్పడు ♦
తప్పుఁ గానక తుచ్ఛమౌ
మమతపైఁ బడి మొత్తుచుండఁగ ♦
మానఁ జాలక భూమియం

దశరథ గారవమంచుఁ దీరని ♦
యాశఁజెంది ముదంబుచే
నెమరు జేయుచు సత్యవంతుల ♦
నిందఁజేయకె! చిత్తమా! ౩౪

మత్తకోకిల॥ ఆకులందిన కొంటనే ముద ♦
ముంది భూటగునట్టి తం
బాకుఁబొకలు సున్నమాదిగ ♦
నంటరానివి చేర్చి బల్
పోకగాఁడిని వక్కరించుచు ♦
సొంతకర్మము మారవా
మాకలో బడిపోక ముందటి ♦
త్రుప్పుఁజూడవె! చిత్తమా! ౩౫

ఆ॥వె॥ సత్ప్రవర్తనంబు ♦ సలుపనేరక సదా
వాక్ప్రసిద్ధికొరకు ♦ వాగుచుండు
నట్టివారికెట్టు ♦ లభ్యమగును దేహ
శోధఁజేయు వాయు ♦ సాధనంబు. ౩౬

ఆ॥వె॥ తత్త్వబోధఁజేరు ♦ దలఁచి సద్గురు చెంత
కేగి యాత్మ సత్య ♦ మెఱుఁగవలెను
గాని మాటలెట్లు ♦ ఘటశుద్ధిఁ గావించు
న్యాయమునరసితివా? ♦ మాయ మనసా! ౩౭

ఆ॥వె॥ నోటివల్ల చల్ల ♦ కోటి యోగమునందు
నూటిఁ బొత్తు కోవు ♦ దాటఁబెట్టి
రాటుబొంది బొంది ♦ చేటుఁజెందక సదా
దాటు మాయ మాయ ♦ దారిమనస! ౩౮

తే॥ గీ॥ సూర్యచంద్రుల గుర్తించి ♦ సూక్ష్మమైన
బాటఁ గనిపెట్టి యానంద ♦ భాగ్యమునఁగు
వాయువర్ధానిలోఁ జేరు ♦ బాటమెఱిఁగి
సాధకముఁజేసి చూడవే? ♦ చావు మనస! ౩౯

తే॥గీ॥ సంశయమడంచు హఠవిద్య ♦ సంగ్రహించి
సత్త్వగుణ శక్తిఁజేపట్టి ♦ సంచరించి
యచలపరిపూర్ణభావమం ♦ దంటుఁగాంచి
మాఁటినడఁబాసి యుండుటే! ♦ ముక్తి మనస! ౪౦

తే॥గీ॥ బూటకఁపు వేషములు వేసి ♦ భూమియందు
సిద్ధపురుషులమని చెప్పి ♦ సిగ్గులేక
కృత్రిమంబైన గంజాయి ♦ పత్రి పీల్చి
వదరుబోతుల జేరకే! ♦ విధవ మనస! ౪౧

తే॥ గీ॥ మాయఁ గవలేక సంసార ♦ మహిమవలన
మనసులోఁగల్గు దుఃఖముల్ ♦ మాటుపరచి
పైకి సంతోషమున్నట్లు ♦ పను లొనర్చి
వెతలుఁబడుచుంటి వెందుకే? ♦ వెర్రిమనస! ౪౨

తే॥ గీ॥ మూఢకర్మాభిలాషులై ♦ ముచ్చటఁబడి
ఘోరకార్యంబు లవనిపైఁ ♦ గోరికమరఁ
జేసి మానవధర్మముల్ ♦ చెరిపి చచ్చు
పరమ నిర్భాగ్యులను జేరఁ ♦ బడకె మనస! ౪౩

తే॥ గీ॥ అవనిపై మాయకర్మలం ♦ దంటి భుక్తి
మార్చి యజ్ఞానసంజాత ♦ మహిమవలన
నిజముఛేదించి మాఁటిచే ♦ సిల్గి చెడక
బ్రతుకు సరిచేసి చూడవే ♦ భ్రష్టుమనస! ౪౪

తే॥ గీ॥ స్థూలదేహప్రభావంబు ♦ సున్నఁజుట్టి
సూక్ష్మ కారణములశక్తిఁ ♦ జూరఁగొనుట
ముఖ్యమని చెప్పివాదించుఁ ♦ మూఢులవని
వ్యర్థులైపోవుటెరుఁగవే! ♦ వెఱ్ఱిమనస! ౪౫

తే॥ గీ॥ కండ్లతో కర్మ ఫలితముల్ ♦ గనుచుభుక్తి
తప్పఁగనలేక దుర్మార్గ ♦ మొప్పితిరిగి
సత్యమెడఁబాసి బాధతోఁ ♦ జచ్చునట్టి
మానవుల చెంతఁ జేరకే! మాయమనస! ౪౬

తే॥ గీ॥ సకలవిధ కష్టములుఁ బెట్టి ♦ చంపునట్టి
తుచ్ఛసంసారమునఁ జేరి ♦ త్రుళ్లిపడక
సృష్టిశోధించుటకు యోగ ♦ దృష్టినిచ్చు
మౌనముద్ర ధరింపవే! మాయమనస! ౪౭

తే॥ గీ॥ అతిపరాక్రమ చర్యలం ♦ దంటి పేరు
వడసి మితిలేని యిడుములుఁ ♦ బడుటకంటె
శాంతమమరించి మదియందుఁ ♦ జింతఁబాసి
సుస్థిరము గాంచుటే! మహా ♦ సుఖము మనస! ౪౮

తే॥ గీ॥ ఘటమునం దింద్రియంబులఁ ♦ గట్టిపెట్టి
పంచభూతాంశలందులోఁ ♦ బదిలపరచి
నిజము శోధించు ధైర్యంబు ♦ నిలుపలేక
మండిపడుచుంటి వెందుకే? ♦ మొండిమనస! ౪౯

తే॥ గీ॥ భూతకాలంబు మాయచే ♦ బూడిదయ్యె
వర్తమానంబు గతకాల ♦ వరుసఁబూనె
భావికాలంబదే రీతి ♦ ఫలముగాన
మోసపడి సంతసించకే! ♦ మొండిమనస! ౫౦

తే॥ గీ॥ యోగమార్గించి కలుష సం ♦ యోగ ముడంచి
సృష్టిశోధించి యాత్మసం ♦ తుష్టిగాంచి
పరమహంస స్వరూపుడై ♦ చరగునాథు
మానవునిం జేరి చూడవే ♦ మాయ మనస! ౫౧

తే॥ గీ॥ సామజేయుటకై సదా ♦ సాహసించు
మోటుమానవులను జేరి ♦ మోదమంది
హంస చలనంబు కొంచ్చించి ♦ వానిం గనక
సృష్టిగుర్తించి చూడవే! ♦ దుష్టమనస! ౫౨

తే॥ గీ॥ జగతిపైం గాలగతివల్ల ♦ జరుగుచుండు
వానిం దొలగింతుమని చెప్పి ♦ శనిలోని
మంత్రములు వాగి సర్వదా ♦ మాయం జేయు
పలుగు మనుజాలం గూడకే ♦ పాడుమనస! ౫౩

తే॥ గీ॥ విహిత గురువర్యుండధ్యాత్మ ♦ విద్యలోని
మొదలకంజూపించి శిష్యుని ♦ కరవుదీర
సచ్చిదానంద భాగ్యంబొ ♦ సంగనేని
జన్మ రాహిత్యమగుట ని ♦ జంబు మనస! ౫౪

తే॥ గీ॥ ఆదిం గనిపెట్టి సంసార ♦ బాధ కట్టి
యనుభవానంద మాత్మరతుం ♦ దంటం గట్టి
నిర్వికల్ప సమాధిలో ♦ నిలుచునట్టి
గురు స్వరూపంబు గుర్తించి ♦ తిరుగు మనస! ౫౫

తే॥ గీ॥ మాయ మాయందును శోధించి ♦ ముదముం గాంచి
యారు ఖండించి తైదింటి ♦ కాదిం దెలిసి
యేకమై పోవు సుజ్ఞాన ♦ మెరుకం జేయు
నట్టి సద్గురు పాదముల్ ♦ బట్టు మనస! ౫౬

తే॥ గీ॥ యోగ్యమా సంతతానంద ♦ భాగ్యమగుచుఁ
బరమ సౌఖ్యస్వరూపమై ♦ పరగు ప్రణవ
నాదమాలించి గుర్తించి ♦ మోదమంది
మది విచారించి చూడవే? ♦ మాయమనస! ౫౭

తే॥ గీ॥ చిరతరాభ్యాస వృత్తి నే ♦ మరక నరులు
సాధ్యమైనట్టి జప్యానే ♦ చంపలేరు
కఠినతరమౌచు నొకరీతిఁ ♦ గట్టియుంచ
వీలుగానట్టి త్రిగుణముల ♦ పెకు టెట్లు? ౫౮

తే॥ గీ॥ జ్ఞానమెఱుఁగని యతికష్ట ♦ మానవుండు
బాల్య యౌవన కౌమార ♦ మూల్యమెల్ల
నాటలను గాంతసుఖముల ♦ నధికలోభ
ములను నరవుచ్చి వృద్ధాప్య ♦ మును మిగుల్చి
హేతువెఱుఁగక చావంగ ♦ భూతలమున. ౫౯

తే॥ గీ॥ అవనిపై సత్ప్రవర్తనం బాచరించి
ముదముఁగనఁ జాల కత్యాశ ♦ మూలమైన
మాయచే దుఃఖపడి చచ్చు ♦ మానవులకు
ఘనతరాత్మాను భవసిద్ధి ♦ గలుగు టెట్లు? ౬౦

తే॥ గీ॥ సత్యమునుబట్టి జగతిపై ♦ సంచరించు
మనుజవర్యుండు ధీశక్తి ♦ మహిమవలన
నిర్భయముఁగల్గి స్థిరమైన ♦ నిద్రఁదెలిసి
ముక్తిఁగాంచును సంగవి ♦ రక్తుఁడగుచు. ౬౧

తే॥ గీ॥ కాలచక్రంబు గుర్తించు ♦ వీలుఁగాంచి
పంచభూతంబులనుబట్టి ♦ పనులొనర్చి

మోక్ష సామ్రాజ్యమునఁ జేరు ♦ దీక్షఁబూని
సం[illegible]వా! చిత్తమా! ♦ చావుఁదెలిసి. ౬౨

క॥ ప్రేమించిన సద్గురువరు
నామంబును మానసమున ♦ నాటించిన వా
డీమానవ జన్మములోఁ
గామించినఁ బొందరాని ♦ కార్యముఁగలదే! ౬౩

క॥ చిత్తముపై పంచేంద్రియ
పెత్తనమిడి యమితమైన ♦ పెనుబాధల కా
యత్తపడి సంచరించెడు
మత్తుండెటు రాజయోగ ♦ మర్మమెరుంగున్? ౬౪

క॥ దారపుత్రాదులను దన
వారని భ్రమియించి వారి ♦ వలపుల లోనై
భారముఁ బూనిన ♦ మనుజుఁడు
యూరకె చెడి చచ్చిపోవు ♦ నుర్వీస్థలిపై. ౬౫

క॥ మానవజన్మమునందు ని
దానముఁ గనలేక ఘోర ♦ తర కార్యములన్
బూనికతో నొనరించెడు
దీనులకిల సంతసించు ♦ దినములు గలవే ! ౬౬

క॥ సతి సుత హిత బంధముచే
వెతఁజెంది హరించు తుచ్ఛ ♦ వేడుకకై న
మ్మతిఁ బూని బ్రతికి క్షితిపై
చతికిలఁబడు నరుఁడిఁకెట్లు ♦ సత్యముగాంచున్? ౬౭

క॥ రసవంతమంచు వతిసా
హసులై పనిఁబూని ప్రాణ ♦ హానికి లోనై

మసలుచు మనుజులు తెగదిను
పశుఫలితము కంటె ఘోర ♦ పాపముఁ గలదే! ౬౮

కం॥ యోగుల కబ్బెడు శాశ్వత
భోగములను గవక దుష్ట ♦ భోజనములనే
బాగనుకొని చేయుచుఁ దెగ
వాగెడు మానవుల కెట్లు ♦ వాంఛ లడంగున్? ౬౯

క॥ ఘనతరమగు హఠయోగం
బునఁ గల జలసాధనమును ♦ పూనిక తోడన్
గనుఁగొనఁదలఁచిన సజ్జను
లనుదిన మాహార ధర్మ ♦ మరయఁగ వలయున్. ౭౦

క॥ అంబు చరిత్రం బెరుఁగక
దంభముతోఁ బ్రాణవాయు ♦ ధారణమున కా
రంభముఁ జేసెడు మనుజులు
కుంభకమును గానలేక ♦ కూలుదు రవనిన్. ౭౧

క॥ మలఁ బలఁ యుతులగు నరు లిల
జలసాధన మహిమవలనఁ ♦ జక్కని స్థిరమౌ
బలమేర్పడి బ్రతికిన యా
వల కుంభకయోగ మనుభ ♦ వముఁ జేయఁదగున్. ౭౨

క॥ ఉదకపు గుణముకు వెరువని
విధమరయుచు మనుజ యాశన ♦ వివర మెరిఁగి స
మ్మదమునఁ దినగల యతులకు
మది కుదురగు నదును దెలిసి ♦ మనుసుఖ మమరున్. ౭౩

క॥ గాత్రఁపుసూత్రముఁ గనకే
కాత్రముతో నమితమైన ♦ యాహారం బీ

ధాత్రినిఁ దెగఁదిన్న జ్ఞానవ్న
మాత్రులకీలాగు వ్రాయు ◆ మర్మము తెలియున్? ౭౪

క॥ మనుజుని రూపము జ్ఞానుల
విని కని యూహించరాని ◆ విధమైనపోయెన్
యనయము విషయముల భోజన
మును మెచ్చి చరింపుచున్న ◆ మూఢాలము చేతన్. ౭౫

క॥ దేహాభిమానముండఁగ
సోహమ్మనం ధర్మమ్మెరిఁగి ◆ సుస్థిరమతివై
మోహాదులెల్ల వీడి ప
లాపార్థమ్ముఁ జెప్పి కాంచు ◆ మచలమ్ము జీవా! ౭౬

క॥ లోకమున దేహముండఁగ
లోకమ్ము దేహపరిసక్తి ◆ లోఁబడియుండన్
వ్యాకులపడి నిరతమ్ముమతి
లేకెప్పుడవేల? బుద్ధి ◆ లేదటె? జీవా! ౭౭

క॥ జ్ఞానేంద్రియ పంచకమును
మానసమందణఁచి పట్టి ◆ మర్దించి తగన్
బూనికతోఁ జిత్తస్వా
ధీనమ్ముఁ గావించ ముక్తి ◆ తెలియును జీవా! ౭౮

క॥ జలమహిమవలన దేహపు
మలముల వెడలించునట్టి ◆ మార్గం బెద్దలోఁ
గల మానవజన్మంబున
ఫలితము గుర్తించి బాగు ◆ పడుమిక జీవా! ౭౯

క॥ ముందుఁగ సద్గురుకారణ
మంది మహాతత్త్వలక్ష్య ◆ మలవడ ధరపై

బిందువుఁ బిండాండంబున,
బంధించిన ముక్తి బట్ట • బయలగుజీవా! ౮౦

క॥ సింహములారిఁటి మదిలో
సంహారముఁ జేయలేని • సన్న్యాసముతో
విహ్వలమతివై పర్వత
గహ్వరముల కేగి ముక్తిఁ • గను టెట్లు? జీవా! ౮౧

క॥ క్షుద్రాభ్యాసంబులకై
భద్రంబగు దేహయంత్రి • భాగ్యంబిలపై
ఛిద్రముఁ జేయక సద్గురు
ముద్రమరిగి చూడు! సృష్టి • మూలము జీవా! ౮౨

క॥ పిండబ్రహ్మాండములను
కుండలియందమరఁ జేసి • కూటస్థుండై
పండిన సద్గురువర్యు న
ఖండితముగఁ జేరి ముక్తి • గాంచవె! జీవా! ౮౩

క॥ కాలము దండుగఁ జేయుచు
మేలెరుఁగక చచ్చు దుష్ట • మేళముతో నీ
మూలముఁ దెంపక సద్గురు
పాలిటఁబడి చూడు! జన్మ • ఫలితము జీవా! ౮౪

క॥ తినరాని వస్తువులనే
ఘనమనుకొని మ్రింగుదుష్ట • గణములతో నీ
తనువుకుఁ బనిగల్పింపక
వెనుకటి యానందకర్మ • వెదకవె! జీవా! ౮౫

క॥ చింతఁబడ నేటికిఁక నీ
మంతనమం దగ్ని నీరు • మన్నెరిఁగినచోఁ

జెంతనె యున్నది సర్వము
నంతంబై చూడు! జన్మ ♦ నటనకు జీవా! ౮౬

క॥ అపవిత్రంపు రక్తము నీ
యుపయోగ పవిత్రయూహ ♦ లుంచదు మదిలో
నుపమెఱిఁగి హారముచేతను
విపరీతము దాటి సృష్టి ♦ విధి గను జీవా! ౮౭

క॥ ఈక్షితిపై మానవహిత
భక్షణమొనరించి నీటి ♦ బలమెఱిఁగినచో
శిక్షనె యున్నది మంచి సు
రక్షితమిదుమందుఁ జూడ ♦ రాదఁటె! జీవా! ౮౮

క॥ భూతము లైదిఁటితో నీ
చాతుర్యము లెల్లఁ జూపి ♦ చంచల మతివై
ఖ్యాతలుఁ గూసి హరించక
బూతెఱిఁగి తరించు విద్యఁ ♦ బూనవె మనసా! ౮౯

క॥ మోహములోఁబడి కూలక
దేహము సవరించి దివ్య ♦ తేజాన్వితమౌ
సోహముఁ గనుఁగొని మఱి సం
దేహములను వీడి నిజముఁ ♦ దెలియవె! మనసా! ౯౦

క॥ ఆధారచక్రమాదిని
సాధించి యథార్థమైన ♦ సంగతు లిలపై
బోధింపుచు విహరించెడు
సాధులఁగని పాదపూజ ♦ సలుపవె! మనసా! ౯౧

క॥ వరజన్మములో సద్గురు
వరు ధర్మంబెఱుఁగలేక ♦ వదరెడు మనుజుల్

ధరపై నిరతముగను దు
స్తరమగు సంసారశిక్షు ♦ దాటవె! మనసా! ౯౨
క॥ సర్వము స్వాంతంబనుకొని
గర్వించి హరించునట్టి ♦ ఘనవేషంబీ
యుర్వీపయి వేసి నీలో
సర్వాత్ముని మరచిపోకు! ♦ సంకరమనసా! ౯౩
క॥ వేళాకోళముగా నీ
కాలము పరిపుచ్చు పాడు ♦ కర్మంబులతోఁ
జాల కృషిఁజేసి మానవ
పోలికఁ జెడఁగొట్టి బాధఁ ♦ బొందకె మనసా! ౯౪
క॥ జగతిని సకలవిషంబులఁ
దగువిధముగ పనుపుపరచి ♦ తప్పని పనిగాఁ
దెగఁదిని వెతఁగను జనులకు
భగవంతుని జూడఁ గానఁ ♦ బడుకెటు? మనసా! ౯౫
క॥ ధనమదమున నొడలెరుఁగక
ఘనమనుకొని వికటరుచులు ♦ గల సరకుల నె
ల్లను గలిపి పచన మొనరిచి
తిను మనుజుల చరితమెరిఁగి ♦ తిరుగవె! మనసా! ౯౬
క॥ వేదాంత గ్రంథమ్ముల
నాదరముగఁ జూచు భాగ్య ♦ మబ్బుట కొరకై
సాధులు దయతోనొసగు సు
బోధామృత పానదీక్షఁ ♦ బూనవె! మనసా! ౯౭
క॥ బ్రహ్మోపదేశమై ఘన
బ్రహ్మాండ చరిత్ర మెరిఁగి ♦ బ్రతుకుచు మదిలో

బ్రహ్మంబంటిన వరస్థ
ద్బ్రహ్మణ భూజానురక్తిఁ ♦ బడయువె! మనసా! ౯౮

క॥ మనసే మూలము జన్మకు
మనసే మూలంబు సకల ♦ మతముల కెల్లన్
మనసే మూలము కర్మకు
మనసే మూలంబు యోగ ♦ మహిమకు జీవా! ౯౯

క॥ మనసే బ్రహ్మాండంబై
తనరుచుఁ బిండాండమయ్యెఁ ♦ దథ్యం బరయన్
మనసే సకలంబయ్యెను
మనసెరిఁగి తరింతు నిష్ఠ ♦ మరువకు! జీవా! ౧౦౦

క॥ మంగళమా! సద్గురువకు
మంగళమాత్మస్వరూప ♦ మహితాత్మునకున్
మంగళమా! సర్వమునకు
మంగళమాత్మావలోక ♦ మహిమకు మనసా! ౧౦౧

గద్య

ఇది శ్రీలక్ష్మీనారాయణ యోగీశ్వర గురుకరుణా కటాక్ష
వీక్షణ సంలబ్ధ తారయోగసామ్రాజ్య ధురంధర
ఆపస్తంబసూత్ర వసిష్ఠసగోత్ర పవిత్ర క్షత్రియ
వంశోద్భవాయుర్వేద సుధానిధి పోత్తూరి
కృష్ణంరాజయోగి ప్రణీతంబైన
తత్త్వలక్ష్యార్ణవము నందు
ద్వితీయోద్దేశము.



శ్రీ మ దస్మద్గురు పరబ్రహ్మార్పణమస్తు.



ఓమ్

శ్రీ గురుభ్యోనమః

# తత్త్వలక్ష్యార్ణవము.

## తృతీయోద్దేశము.

### 1 తత్త్వము.

శంకరాభరణము—ఆది తాళము.

1 శ్రీ భగవంతుని గనుగొనుటకు యీ ♦ లోభ మోహా
ములు వీడరయా!॥ నాభియందె బ్రహ్మాండము గనుపెను
లాభ మెరిగి వర్తింపరయా? ॥శ్రీ॥
2 హీనమైన సంసార మనే యీ ♦ కానయందు బడనేటి
కయా ?॥ సూనులు భార్యా హితులును దుఃఖము ♦
మానుపలేరని నమ్మరయా ? ॥శ్రీ॥
3 పరుల ప్రేమలో బడిపొర్లుటచే ♦ పరముకు మార్గము
తప్పవయా ?॥ పరులు కామక్రోధ భరితులై కడు ♦

దురితములలో బడుచుంటిరయా? ॥శ్రీ॥

4 భగవంతుని గుర్తించని జన్మము ♦ జగ ముందుండిన నెందుకయా?॥ తెగపెరిగిన యీపాదు దేహమును ♦ తగినరీతిగా మార్చరయా? ॥శ్రీ॥

5 ఇలపై హఠయోగ సాధనము దు ♦ ష్టుల కెన్నడు సిద్ధించదయా?॥ తెలివిగల్గి శ్రీకృష్ణంరాజు ♦ పలుకులు మదిలో నుంచరయా? ॥శ్రీ॥

## 2 తత్త్వము.

### భైరవి—అట తాళము.

1 గురు స్వరూపము గాంచుమా?॥ సద్గురుబోధ॥ మరువక మది నిల్పుమా?॥ వరమునీంద్రులు జ్ఞాన ♦ నిరతులైచూచు శ్రీ ♦ కరమార్గ వేదాంత ♦ పరము సుస్థిరము! శ్రీ॥ గు॥

2 గురు వాక్యములు నమ్ముమా?॥ సద్గురుబోధ॥ మరి మరి శోధింపుమా?॥ పరమగోప్యము పాప ♦ హరము సజ్జనస్తోత్రి ♦ కరము నిత్యానంద ♦ తరము! శ్రీ కరము! శ్రీ ॥గు॥

3 గురు చరణములు బట్టుమా?॥ సద్గురుబోధ ॥ వదిలిపెట్టి గుర్తింపుమా?॥ ధారుణిలో లక్ష్మ ♦ నారాయణార్య స ♦ ద్గురుని కృష్ణంరాజు ♦ మరిగి సేవించు! శ్రీ॥ గు॥

---

## 3 తత్త్వము.

### మలయమారుతము—ఆది తాళము.

1 మానవ ధర్మము గనుగొన దలచితే ♦ మానసమును

స్థిరపరచ వలెరా॥ మానసమును స్థిరపరచుట కొఱకై ♦
హీనకృత్యములు మానవలెరా ॥ మా॥

2 హీన కృత్యములు మానదలంచితె ♦ హింస విడిచి
వర్తించవలెరా॥ హింస విడిచి వర్తించుట కొఱకై ♦ సం
సారము వర్జించ వలెరా॥ మా॥

3 సంసారము వర్జించ దలంచితె ♦ సత్యము పరిశోధించ
వలెరా॥ సత్యము పరిశోధించుట కొఱకై ♦ సద్గురు
కారణ మందవలెరా ॥ మా॥

4 సద్గురుకారణ మందదలంచితె ♦ సంశయరోగ
మడంచ వలెరా॥ సంశయ రోగమడంచుట కొఱకై ♦
సత్సాంగత్య మొనర్చవలెరా॥ మా॥

5 సత్సాంగత్య మొనర్చ దలంచితె ♦ సాత్త్విక భోజన
మరయవలెరా॥ భోజన మరయుట కొఱకై కృష్ణం ♦
రాజయోగి మతమెరుగ వలెరా॥ మా॥

## 4 తత్త్వము.

భైరవి—ఆదితాళము.

1 గురు చరణము గని గుర్తెఱిగి నీ ♦ దురితము బాయవె!
రో మనసా?॥ స్థిరము లేని యీనరజన్మము నీ ♦ పరము
దొరించు లుచ్ఛామనసా? ॥గు॥

2 ధ్వంసము తప్పదు సంసారవు సా ♦ రాంశము గను
గొనవే! మనసా?॥ హీనకు లోనై మాంసము దిని చెడి♦
మసల బోకు లుచ్ఛామనసా?॥ గు॥

మంత్రములునమ్మి ♦ యూడియాన పడబోకేమనసా ?
॥ ప ॥

5 కూరిమితో లక్ష్మి ♦ నారాయణార్యుని ♦ చేరి సేవింపవే మనసా ॥ ధారుణిపై శ్రీ పొ ♦ త్తూరి కృష్ణంరాజు ♦ పోరుచుండెనే పరిమనసా? ॥ప॥

---

## 6. తత్త్వము.

సావేరి — ఆది తాళము.

1 గతి యొట్టిదో తెలియలేక యతి దు ♦ ర్మతి యుతులై చెడు చుంటిరయా? ॥ సతినిబొంది సుతులనుగని పెంచుట యతి వెతలని మది నెరుగరయా? ॥ గ ॥

2 మూలమును దెలియక చచ్చుటకే ♦ మాలపల్లె ప్రాప్తించెనయా? ॥ గోలపెట్టి కూలునాటి కెవ్వరు ♦ మేలు తేలమును జేయరయా? ॥గ॥

3 పాలుమాలి సంసారములో బడి ♦ తూలి కాలిపోనేలనయా? ॥ ఆలుపిల్లలానందమునన్ బడి ♦ కాలము బోవుట గానరయా? ॥గ॥

3 విధవ లిప్పలివి తుదకెందులకో ♦ మదిలో కుదురుగ జూడరయా? ॥ హృదయ సదనమును పదిలపరచియు ♦ సదమల మార్గము గాంచరయా ? ॥గ॥

5 నాదు బిందు కళలంటి మనంబున ♦ భేద వాదములు వీడరయా?॥ సాధులు కృష్ణంరాజయోగి గని ♦ సారము పరిశోధించరయా? ॥గ॥

## 7. తత్త్వము.

బేహాగ — ఆట తాళము.

1 దేహమున కాధారకరమగు ♦ సోహమును గుర్తింపు
వమా? ॥ మోహపాశ వశంబులోబడి ♦ మోసపోకే
జీవమా? ॥ దే॥

2 కర్మ జాలము వంటుకొని పర ♦ ధర్మ మేమర బోకు
మా? ॥ నిర్మలంబగు జ్ఞానమునుగని ♦ చర్మబంధము
వీడుమా? ॥ దే॥

3 తోలు మాంసంబెముకలునుగల ♦ కీలుబొమ్మది చూడు
మా? ॥ ఆలుబిడ్డల చింతలోబడి ♦ కూలిపోవుట
దాటుమా? ॥ దే॥

4 పొట్ట కొరకై రట్టుజెందెదు ♦ వట్టి ఘటమిది నమ్మ
మా? ॥ గుట్టు గనుగొని గురునిపాదము ♦ బట్టి సద్గతి
గాంచుమా? ॥ దే॥

5 ఈజగతి పొత్తూరి కృష్ణం ♦ రాజయోగి స్వభావమా?॥
తేజ మెరిగి తరించుటకు నీ ♦ తెలివి నిత్యము
గోరుమా? ॥ దే॥

---

## 8. తత్త్వము.

రేగుప్తి - ఆట తాళము.

యోగాభ్యాసము చేయరా? ॥ భోగములోక్క ॥
రోగాముతో నున్నారా? ॥

1 రాగమోహపు జనితమగు నీ ♦ భోగములయం దాశ
విడచి ♦ బాగుపడి సత్యంబుగని హాత ♦ యోగివై
జీవించదలచి ॥ యో॥

2 పొందుగా షట్కర్మ[illegible] నొందు పరిశోధించి
సత్ఫల ♦ మంది వేడుక జెంది నిజమౌ ♦ బిందుమార్గ
మెరుంగ దలచి ॥యో॥

3 ప్రాణవాయువునం దపానము ♦ ప్రాణ గనుగొని
యైక్యపరచి ♦ వేణుదండాగ్రమున గల పర ♦ మాణు
వును గుర్తెరుగ దలచి ॥ యో ॥

4 అష్టవిధ కుంభకము లలవడు ♦ నిష్ఠ సద్గురు కరుణచే
గొని ♦ కష్టపడి సాధించి మదియుం ♦ దిష్టసిద్ధిని బొంద
దలచి ॥యో॥

5 ఈజగతి పొత్తూరి కృష్ణుం ♦ రాజయోగి నుతింప
సాత్త్విక ♦ భోజనం బొనరించి మానస ♦ తేజమెరిగి
తరించ దలచి ॥యో॥

## 9. తత్త్వము.

అసావేరి—ఆది తాళము.

1 పరమ గురుని కరుణామృతమున నీ ♦ నరజన్మము
తరియించుమురా! ॥ స్థిర మెరింగి సద్గురువరు నెవ్వడు ♦
మరపులేక మదినుంచుమురా? ॥ప॥

2 ఇద్దరిలో గలదేకమంచు నీ ♦ బుద్ధి నెరిగి యూహించుమురా! ॥ మొద్దువాడవై మోహములో బడి ♦ పెద్ద
లతో వాదించకురా! ॥ప॥

3 మాటకు తొంబది కోట్లభావములు ♦ నూటి దెలిసి
మాట్లాడుమురా! ॥ వాటమెరుగ కారాటము సల్పిన ♦
చేటు మూడుటే సత్యమురా! ॥ప॥

♦ ధరలో లక్ష్మీనారాయణగురు ♦ వరదు నాశ్రయింది చేరోరా! ॥ వరవ చిత్రముగ కృష్ణరాజ ♦ చరిత మరసి బోధించెనురా? ॥వ॥

---

## 10 తత్త్వము.

శంకరాభరణము—ఆట తాళము.

మదియందు చర్చింపుడీ! ॥ మాటలు నేర్చి ॥ వదరు చుండుట మానుడీ! ॥

1 వదన గహ్వరమునను లోనై ♦ ముదముజెంది చెడుళ్ళ గాని; ♦ గుదము స్వాధీనంబు జేసి ♦ మదమడంచ దలంతురా! మీ ॥మది॥

2 భోగములకై స్నాన సంధ్యలు ♦ యాగములు సల్పుటయె గాని; ♦ రాగరహితంబైన రాజ ♦ యోగ మరయ దలంతురా! మీ ॥మది॥

3 వేదశాస్త్రములెల్ల జూచియు ♦ గాధముగ మునుగుటయె గాని; ♦ బాధలను తెలద్రుంచు వాయు ♦ సాధనము గన దలతురా! మీ ॥మది॥

4 ధప్పళములను పిండివంటల ♦ నెప్పుడును గోరుటయె గాని; ♦ వప్పులాకులు పండ్లు దుంపలు ♦ చప్పిడివి తిన దలతురా! మీ ॥మది॥

5 బూటకంబులు నేర్చి కలియుగ ♦ నాటకం బాడుటయె గాని; ♦ మూటి భారమడంచు సద్గురు ♦ సూటి నెరుగ దలంతురా! మీ ॥మది॥

6 కష్టపడి కార్యములు చేసి ♦ నష్టమైపోవుటమె గాని; ♦ తృప్తి కృష్ణంరాజయోగి ♦ కిష్టముగ మన దలతురా! మిా ॥మది॥

## 11 తత్త్వము.

హిందుస్థానితోడి—ఆది తాళము.

హాతమురా! సాధించ నెంచుమురా! ॥ ఘట ముండగానే ॥హాత॥

1 కఠినామైన నట్టిమాయా ♦ నటనా లమరినకర్మ ♦ ఘటి లా పొడగించు సాధు ♦ మతములో చేరుటకై! ॥హా॥

2 తూటూలన్నియు మూంచి ♦ నీటితో శుద్ధిచేసి ♦ మూటి నెదిరించి ముక్తి ♦ బాటా గనిపెట్టుటకై! ॥హా॥

3 మోదాముతో సంసార ♦ ఖేదాము జెంది రోగ ♦ బాధాలో గూలు దేహ ♦ శోధా గావించుటకై! ॥హా॥

4 అతులితమైన మిథ్యా ♦ వెతలాచే కాలమెల్ల ♦ హాత మూగావించు దుష్ట ♦ మతమూ లెడబాపుటకై ॥హా॥

5 ఈజగంబున కృష్ణం ♦ రాజాయోగీ సేవించు ♦ భోజా నమొరిగి దివ్య ♦ తేజాము గాందుటకై! ॥హా॥

---

## 12 తత్త్వము.

శంకరాభరణము—ఆది తాళము.

1 చిత్తము దెలియుమి ♦ విత్తవంతులీ ♦ తత్త్వవిచారము చేయరయా!॥ సత్యా మెరింగిన ♦ యుత్తములిల జెను ♦ పెత్తనమున బడి చావరయా! ॥చి॥

2 ధనసంపాదన ♦ మునకై వెతగను ♦ తను ఫలితము గుర్తించరయా! ॥ చెనటులందరీ ♦ పనిలో జారబడి ♦ దినములు వృధగావింతురయా! ॥చి॥

3 గుభగుభ లాడుచు ♦ వ్యభిచారములను ♦ సభల యందు చర్చింతురయా! ॥ సభ ఃపుష్పము లీ ♦ విభవ ములనుకొని ♦ యభిమానము గనజాలరయా ॥చి॥

4 ఘటమున జీవము ♦ గుటగుటలాడిన ♦ నటనలెల్ల మటు మాయమయా! ॥కుటిలమైన లం♦ పటసంసారం ♦ బటుమీదట యెందేగునయా ! ॥చి॥

5 భూజనకల్పిత ♦ భోజనమే! తమ ♦ పూనీజయ మను కొందురయా! ॥యీ జగతిని యీ ♦ వ్యాజము కృష్ణం♦ రాజయోగి దరి జేరదయా! ॥చి త॥

## 13 తత్త్వము.

దేవగాంధారి—ఆట తాళము.

1 మతమూల శోధింపుడీ! ॥ మానవులారా ॥ గతియేదో పరికింపుడీ! ॥ మతములను శోధించి ఘన న ♦ ద్గతిని బొందుట మరచి మూఢ ♦ మతిని యరిషడ్వర్గమున బడి ♦ వెతలు జెంది చరించు టేల! ॥మ॥

2 మోసాములను ద్రుంచుడీ! ॥ జగమున మాయా ॥ వేషా భావలు వీడుడీ! ॥శ్వాస ధర్మము దెలియ లేక వి♦ నాశ మొందెద రేల ధరపై ♦ వాసిగాంచిన రాజయో గము ♦ బాసి గాసిని జెందు టేల! ॥మ॥

3 ముందు మార్గము జూచుడీ! ॥ వేదాంత స ॥ ద్గ్రంథ
ములను గాంచుడీ! ॥ సందియముల న్వదలి మానవ ♦
సుందరము గుర్తించు యత్నము ♦ లంది భోగము
లందలే కతి ♦ మందమతులై కుందుటేల! ॥మ॥
4 హీన గుణములు మానుడీ! ॥ భూతములకు ॥ హాని
చేయక బ్రతుకుడీ!॥ పీనుగుల దిన మరిగి ముక్తిని ♦
దానమును తెగవేసి హింసను ♦ మాన జాలక ఘోర
కర్మలు ♦ బూని గతులను జెరుచుటేల! ॥మ॥
5 పూజితమును బొందుడీ! ॥ సృష్టినిబట్టి ॥ భోజానా
మొనరింపుడీ! ॥ యీజగంబున సాధుజన స ♦ మాజ
మున పొత్తూరికృష్ణం ♦ రాజయోగి ధరించు సద్గురు ♦
తేజ మెరుగని తెలివదేల! ॥మ॥

## 14 తత్త్వము.

రేగుప్తి—అట తాళము.

1 గాత్రి మర్మం బెరుగవలెనన్నా! ॥ స్థిరమైన మానస ॥
నేత్రమున కది గానబడునన్నా!॥ గాత్ర మర్మ మెరుంగ
జాలక ♦ మాత్ర మార్గంబంటు కొని యావ ♦ విత్రలక్షణ
ములకు లోనై ♦ ధాత్రిపై దుఃఖించ నేటికి! ॥గా॥
2 కట్టులోబడి కూలబోకన్నా! ॥ పరికించి నీలో ॥ బుట్టు
శాశ్వత ఫలముగనుమన్నా! ॥ దిట్టమగు రోగములచే
బహు ♦ రట్టుగని దుఃఖించి విధిగా ♦ బుట్టి పెరిగి
నశించుచుండెడి ♦ వట్టి విభ్రమ జెందనేటికి! ॥గా॥

5 దుష్ట గురుజాలి నష్టమొరుంగక ♦ కష్టములో బడి యుం
టిరయా! ॥ సృష్టిజూచి శ్రీకృష్ణం రాజుటు ♦ స్పష్టపర్చి
బోధించెనయా! ॥తు॥

## 16 తత్త్వము.

కేదారగౌళ—ఆది తాళము.

ఎంత చిత్ర మెంతచిత్రము ॥ మానవులచరిత ॥ మెంత॥

1 ఎంత చిత్ర మెంతమహిమొ ♦ చింతలెల్ల బూనిమాయ ♦
సంతకూట మనుసరించి ♦ భ్రాంతిబొంది చచ్చు
చుంటి ॥రెం॥

2 మాటలెన్నొ నేర్చి పొట్ట ♦ కూటికై వేషములువేసి ♦
నోటి గుదములాడు చెబ్బ ♦ లాటబెట్టి నవ్వుచుంటి ॥రెం॥

3 చచ్చు నరుల జూచిరైన ♦ పిచ్చిభ్రాంతి విడువలేక ♦
తుచ్ఛవృత్తి మరిగి దేహ ♦ మిచ్చివేసి పోవుచుంటి॥రెం॥

4 శక్తిగలిగి తత్త్వశాస్త్ర ♦ సిక్కవమును దెలియలేక ♦
దుఃఖభరితమైన జన్మ ♦ చిక్కబెంచి గూలుచుంటి॥రెం॥

5 చేరి కృష్ణంరాజయోగి ♦ సారమెరిగి తిరుగలేక ♦ క్రూర
వృత్తి మరిగి పుణ్య ♦ దూరులై నశించుచుంటి ॥రెంత॥

## 17 తత్త్వము.

మలయమారుతము—అట తాళము.

1 గాఢతరమా మాయలోబడి ♦ మూఢమతివై పోకు
రా? ॥దూడలు యీభూములు నీ ♦ తోడగూడి రావు
రా? ॥ గా॥

2 తనివిదీరని పనులచే నీ ♦ తనువు బోవుట చూడరా?॥ యునికి జూడక మనుటభిక్షాలి ♦ పనికిమాలిన బుద్ధి రా? ॥ గా॥

3 విధవబుద్ధులు నేర్చి మాయా ♦ పదవి బూనబోకురా?॥ మదముచేతను ముదము జెంది ♦ గుదముచే జచ్చే వురా? ॥ గా॥

4 మట్టుదెలసెడి గుట్టుకొరకై ♦ పట్టు భట్ట వేమిరా? ॥ చుట్టబెట్టుక రట్టుజెందెడి ♦ కట్టులోబడి పోకురా?॥ గా॥

5 ఈజగతి పొత్తూరి కృష్ణం ♦ రాజయోగిని జూడరా?॥ పూజితంబగు బుద్ధిచే నీ ♦ తేజమును గుర్తించరా?॥గా॥

## 18 తత్త్వము.

అఠాణ—ఆది తాళము.

1 మాయను ద్రుంచు యు ♦ పాయంబున్నది♦న్యాయము గనరా? లచ్మీకా!॥ వాయుతత్త్వసా ♦ హాయముచే నీ ♦ కాయంబరయుర? ధగిడీకా! ॥ మా॥

2 తుచ్ఛమైన యీ ♦ పిచ్చిపనులపై ♦ ముచ్చటేలరా? లచ్మీకా! ॥చచ్చిపుట్టుటకు ♦ దీక్షబూని పెను ♦ శిక్ష బొందకుర? ధగిడీకా! ॥మా॥

3 జీవకోటిలో ♦ దేవుడు గలడను ♦ భావ మెరుగరా? లచ్మీకా!॥ శావరమున పెడ ♦ త్రోవను బడి చెడు ♦ చావు జూడకుర? ధగిడీకా! ॥మా॥

4 దేహి నిత్యుడీ ♦ దేహమనిత్యము ♦ మోహ మేలరా? లచ్మీకా!॥ ద్రోహయుతంబగు ♦ నాహారము దివ ♦ సాహసించకుర? ధగిడీకా!॥ మా॥

8 ఇష్టమైన శ్రీ ♦ కృష్ణంరాజిటు ♦ స్పష్ట పర్చెరా! లబ్ధిగాకా!॥ కష్టమాని యీ ♦ సృష్టిగాంచి నీ ♦ నష్టమెరుంగర! ధగిడీకా!॥మాయ॥

## 19 తత్త్వము.

హిందూస్తానీ ఫిల్—ఆది తాళము.

1 లోకమంతా మాయరా? మా ♦ లోకమున బడిపోకు రా!॥ ఏక భావము ద్రెంచి తుద కే ♦ కాకివై చెడిపో కురా?॥ లో॥

2 త్రెంచివేయర యీషణత్రియ ♦ సంచితాగమ మేల రా!॥ పంచభూతము లాత్మగతమగు ♦ టెంచి ముక్తిని జూడరా? ॥లో॥

3 నేలపై గలమచ్చటంతయు ♦ ప్రాలుమాలిన భ్రాంతి రా?॥ వేలు కోట్లార్జించి యుంచిన ♦ మేలు లేశము లేదురా!॥ లో॥

4 నిద్రలోపల భద్రమెరిగే ♦ ముద్ర నేమర బోకురా!॥ క్షుద్ర విద్యలు నేర్చి యీ దా ♦ రిద్ర్యమున కెరగాకు రా!॥ లో॥

5 ఈజగతి పొత్తూరి కృష్ణం ♦ రాజయోగిటు జెప్పెరా!॥ బీజ రక్షణ జేసి మానస ♦ తేజమును గుర్తించ రా!॥ లో॥

## 20 తత్వము.

నాదనామక్రియ — ఆది తాళము.

మాయమై పోతుందయా? ॥ యీదేహము ॥ మా॥
1 మాయమై పోతుందీ ♦ కాయము మిక్కిలి; ♦ హేయ
మైనట్టి యు ♦ పాయములో జిక్కి ॥ మా॥
2 పుట్టుట దుఃఖము గిట్టుట దుఃఖము; ♦ కట్టులో బడి
జన్మ ♦ గుట్టు దెలియ లేక॥ మా॥
3 పెరుగు పాలు బోసి ♦ మెరుగు బెట్టినగాని; ♦ మరణ
మైన మీద ♦ టరనిమిష ముండాక॥ మా॥
4 ఆలు పిల్లలవల్ల ♦ చాలాదుఃఖము జెంది; ♦ వీలుదప్పి
జన్మ ♦ మూల మేమియు లేక॥ మా॥
5 కృష్ణంరాజయోగి ♦ కిష్టమౌ పనిమాని ♦ దుష్టవృత్తు
లు జేసి కష్టించి కష్టించి॥ మా॥

## 21. తత్వము

కాంభోజి — ఆది తాళము.

తప్పదయ్యా! ♦ దుఃఖము ॥ చచ్చేవరకు! ॥తప్ప॥
1 తప్పులో బడి సర్వ ♦ తిప్పలు బొంది యె ♦ ల్లప్పుడు
జీవుల ♦ నొప్పించు వారికి ॥త॥
2 హంస తత్వము మీరి ♦ హింసా నదిగోరి ♦ మాం
సాము దిను మూఢ ♦ సంసార జనులకు ॥త॥
3 ధరపై నిదానించి ♦ గురుభావమును గాంచి ♦ మురి
పెము గనలేని ♦ పరమ వాదస్థులకు ॥త॥

4 కృష్ణంరాజయోగి ♦ శిష్టమా సాధుస ♦ ద్గోష్ఠి కోరువ
లేని ♦ దుష్ట మానవులకు ॥క॥

---

## 22 తత్త్వము.

రేగుప్తి — ఆది తాళము.

1 మాయ సంసార . చిత్తమా? ॥ కాయావిచారము ॥
చేయవే! చేయవే! చేయవే! ॥మాయ॥

2 కాంతా వందాము గోరి ♦ చింతా జేయుచు మాయ ♦
సంతా లోపల దూకి॥ చావకే! చావకే! చావకే!
॥మాయ॥

3 ఆధారమును బట్టి ♦ శోధా జేయాక మొండి ♦ వాదా
ము నోటజెట్టి॥ వాగకే! వాగకే! వాగకే! ॥మాయ॥

4 చంద్ర సూర్యుల తోడ ♦ నింద్రియంబుల బ్రహ్మ ♦
రంధ్రమం దంట గట్టి॥ చూడవే! చూడవే! చూడవే!
॥మాయ॥

దుష్ట బుద్ధులు మాని ♦ కృష్ణంరాజొప్ప కొన్న ♦
శ్రేష్ఠయోగమునందు॥ చేరవే ! చేరవే ! చేరవే !
॥మాయ॥

## 23 తత్త్వము.

నాటకురంజి — అట తాళము.

1 అందమును జూచి ముద ♦ మందకే! డెందమా!॥
ముందుగతి జూడకా ♦ నందమును జెందాబోకే!॥ అం॥

2 ఇల్లు వళ్లు జూచి చాల ♦ త్రుళ్లిపడు చుంటివేమె!
కొల్లావారలంతాముకు ♦ వల్లాకాడు జేర్చాలెద! ॥అం॥

3 బంధూ జాలముంటేనని ♦ ఉందా లాభముంటే వెను!
క్రింద బడి చచ్చునప్పు ♦ డండాలని విడాలెద!॥ ॥అం॥
4 లోకామును నమ్ముకోని ♦ ప్రాణాలాడు చుంటేవెను!
యేక్కాబాట బట్టిపోవ్వ ♦ లోకాలను జూడారద! ॥అం॥
5 కృష్ణంరాజ యోగి మది ♦ కిష్టా మొనరించావెను!
దుష్టానరు తెల్లబడు ♦ కష్టాములు గాంచారద! ॥అం॥

## 24 తత్త్వము.

కనగాంధారి—అట తాళము.

1 మానవాకృతి దెలియుడీ! ॥ సృష్టినిబట్టి ॥ ప్రాణా
యామము జేయుడీ?॥ హీనకర్మలు జేసి మీ నష్టం ♦ జ్ఞా
నమును జెడగొట్టి తీవని ♦ హాని జెంది హరించు టేల
ని ♦ దానవులిగి చరించ నిజమా! ॥మా॥

2 న్యాయ భావము జూడుడీ!॥ భూతములచే॥ కాయాము
శోధించుడీ॥ హేయమైన పదార్థముల నా ♦ దాయపర్చి
నిరంతరం బతి ♦ మాయగా దిని చావనేటికి ♦ హాయి
గాంచి చరించ నిజమా! ॥మా॥

3 రాజ యోగము నంటుడీ! ॥ మీంలోగల్గు ॥ తేజము
గుర్తించుడీ ! ॥ ఈజగతి పాత్రాత్రి కృష్ణం ♦ రాజ
యోగి ముదంబుచే గురు ♦ పూజ జేసి భరించు
సాత్త్విక ♦ భోజనము గుర్తించి నిజమా! ॥మా॥

---

## 25 తత్త్వము.

మలయమారుతము—అట తాళము.

1 జీవమా? మదియందు సద్గురు ♦ భావ మెరుగావే! ॥
పదసేవ జేయావే!! నీ ♦ కావరముచే మాయమై
చను కీవిజూపాకే ! ♦ చెడు తావు బట్టాకే ! యో॥ జీ॥

2 శ్వాస ధర్మమెరుంగ కుండుట ♦ మోసమనుకో
వే ! ॥ బహుదోషమగు చావే !! నీ ♦ నాశనము గని
పెట్ట నేరక ♦ గాసిజెందాకే ! అది ♦ యాసలెందూకే !
యో॥ జీ॥

3 పొత్తూరి కృష్ణంరాజయోగిని ♦ హత్తి చూడావే! ॥
స్థిరచిత్తమూనావే !! నీ ♦ పెత్తనముచే పొంగి పాడు మ ♦
హత్తుజూపాకే! తను ♦ శక్తి మాపాకే! యో॥ జీవమా॥

## గద్య

ఇది శ్రీ లక్ష్మీనారాయణ యోగీశ్వర గురు కరుణా
కటాక్ష నిరీక్షణ సంలబ్ధ హఠయోగ సామ్రా
ధురంధరాపస్తంబ సూత్రి వసిష్ఠస గోత్ర పవి
త్ర క్షత్రియ వంశోద్భవాయుర్వేద సుధానిధి
పొత్తూరి కృష్ణంరాజయోగి ప్రణీతంబైన
తత్త్వలక్ష్యార్ణవము నందు
యోద్దేశము.



శ్రీ మ దస్మద్గురు పరబ్రహ్మార్పణ మస్తు.

# స్త్రీ ధర్మాధర్మములు.

ఆనందభైరవి—ఆది తాళము.

1 పతి కతి హితమా ♦ మతిగలదై స ♦ ద్గతి వెతకినదే! సంసారీ॥ మతి బోయిన గతి సతతము ఛీకొట్టి ♦ వెత జెందునదే! ♦ వ్యభిచారీ॥ ప॥ 2 చిత్తమంత దన ♦ యత్తవారిపై ♦ హత్తి యుంచునదే! సంసారీ॥ పెత్తనదారై ♦ యత్త మామలను ♦ మొత్తియేడ్పునదే! వ్యభిచారీ॥ ప॥ 3 భగవంతుని గన ♦ దగు నియమముతో ♦ జగ మెరుంగునదే! సంసారీ॥ తెగడిని మదమున ♦ సొగసులు జేయుచు ♦ వగలు జూపునదే! వ్యభిచారీ॥ ప॥ 4 పర పురుషుల గని ♦ పరువెరింగి కను ♦ మరిగి తిరుగునదే! సంసారీ॥ మురిపెముతో దన ♦ చరితంబితరుల ♦ కెరిగించునదే! వ్యభిచారీ॥ ప॥ 5 సకల ధర్మముల ♦ నికరమెరిగి పర ♦ సుఖము గోరినదే! సంసారీ॥ వికటసుఖముకై ♦ పకపక మనిపం ♦ డ్లికిలించునదే! వ్యభిచారీ॥ ప॥ 6 పర సతులకు నిహ ♦ పర సౌఖ్యంబుల ♦ గురి జూపినదే! సంసారీ॥ ఇరుగు పొరుగులను ♦ జొరబడి తిట్టిడి ♦ వరుస తెరిగినదే! వ్యభిచారీ॥ ప॥ 7 పెద్దల సంగతి ముద్దుతోడ మది ♦ కద్దుకొన్నదే! సంసారీ॥ గద్దరిబుద్ధిని ♦ హద్దుదప్పి చెడు ♦ విద్యగోరునదే! వ్యభిచారీ॥ ప॥ 8 కృష్ణారాజున ♦ శిష్టమైన యీ ♦ సృష్టెరింగినదే! సంసారీ॥ భ్రష్ట తిండికై కష్టమోర్చి గతి ♦ నష్టపెట్టునదే! వ్యభిచారీ॥ ప॥

ఓమ్.

# పశుసంరక్షణ

## మహాకష్ట సీసదశకము.

సీ॥ శ్రీ పరాత్పరునిచే ♦ సిద్ధమై తినుటకు
ఫల కందమూలముల్ ♦ గలిగి యుండ
నెచ్చోటఁ జూచిన ♦ స్వచ్ఛమై త్రావంగ
ముదిమొసంగెడు మంచి ♦ యుదక ముండఁ
బ్రాణంబుతో నున్న ♦ ప్రతి జీవియును బీల్చ
వసుధ సంపూర్ణమౌ ♦ వాయువుండ
జనుల కేయపకార ♦ మును జేయకను సదా
యాకు తీగలు గడ్డి ♦ వీకి తినుచుఁ
గీ॥ బెరిగి యిష్టాను సారంబుఁ ♦ దిరుగనీక
పట్టి కట్టుచుఁ గొట్టుచు ♦ ఫలిత మనుచుఁ
బశువులను జేర్చి యధ్యాన ♦ పడెదు నరులు
ముదముఁ గనఁ జాలరీ సృష్టి ♦ మూలమెరిఁగి॥ ౧

సీ॥ లేగ దూడలు సదా ♦ త్రాగు చుండెడి పాలు
తమ యబ్బ సొమ్ముగాఁ ♦ దలఁచి వాని
నోరు గొట్టియుఁ జాలఁ ♦ గ్రూరంబుగాఁ బిండి
కాచి పసందుగాఁ ♦ గరడు గట్టఁ
జూచి చల్లని నీరు ♦ బోసి మజ్జిగఁ జేసి
వెన్నఁ దీసియు నేయిఁ ♦ బన్న పరచి

మొండి దేహార్థమై ♦ మోహాంబుతోఁ గ్రుంగి
పాపంబు లేదని ♦ పలుకు చుండి
గీ॥ దారుణంబని మదియందుఁ ♦ దలఁచ లేక
పోషణముఁ జేయుటే మహా ♦ పుణ్య మనుచుఁ
బశువులను జేర్చి యథ్యాన ♦ పడెడు నరులా
ముదముఁ గనఁ జాలరీ సృష్టి ♦ మూల మెఱిఁగి॥ 2

సీ॥ పుట్టినప్పటినుండి ♦ కట్టి పెట్టెడు బాధ
మదియందుఁ గనిపెట్టి ♦ మాన్పలేక
యలవాటుచేఁ బశు ♦ కుల మెల్లఁ బడు బాధ
మదియందుఁ గనిపెట్టి ♦ మాన్పలేక
ఫలితము ల్బొందఁగఁ ♦ బాపాత్ము లిడు బాధ
మదియందుఁ గనిపెట్టి ♦ మాన్పలేక
నరులనేకులు భుక్తి ♦ కొఱకుఁ జేసెడు బాధ
మదియందుఁ గనిపెట్టి ♦ మాన్పలేక
గీ॥ అధికతర పుణ్యకార్య మం ♦ చనుసరించి
మానవాలిక యితరుల ♦ మానసిక
పశువులను జేర్చి యథ్యాన ♦ పడెడు నరులు
ముదముఁ గనఁ జాలరీ సృష్టి ♦ మూల మెఱిఁగి॥ 3

సీ॥ ఆడువానిని లేగ ♦ దూడలతోఁ గూడఁ
బాలకై యింటనే ♦ పాడుఁజేసి
మగవాని నొప్పుగా ♦ లెగ బాడి పొలములోఁ
బడవేసి యీడ్చుచుఁ ♦ బాడుఁజేసి
పనిఁజేయు వానినిఁ ♦ గనిపెట్టి భూమిపైఁ
బండనియ్యక సదా ♦ పాడుఁజేసి

యిష్ట ప్రీకారంబు ♦ గష్టమా పనిలోనఁ
జాతవానినిఁ బెట్టి ♦ పాడుఁజేసి
గీ॥ బాగుగా నున్నయన్నాళ్లు ♦ బాధఁబెట్టిఁ
కండఁ దినివేసి కటికీలఁ ♦ గడకుఁ ద్రోలఁ
బశువులను జేర్చి యధ్యాస ♦ పడెదు నరులు
ముదముఁ గనఁ జాలరీ సృష్టి ♦ మూాల మెరిఁగి॥ ౪
సీ॥ చంటి బిడ్డల రీతి ♦ నింటిలోఁ బోషించి
సొమ్ముకై యితరుల ♦ కమ్మివేయుఁ
దిండి చక్కఁగఁ బెట్టి ♦ కండ బాగుగఁ బెంచి
సొమ్ముకై యితరుల ♦ కమ్మివేయుఁ
బాప పుణ్యము లేక ♦ పని చేయ నూహించి
సొమ్ముకై యితరుల ♦ కమ్మివేయుఁ
జచ్చు వానిని సహా ♦ సంతలన్నియుఁ ద్రిప్పి
సొమ్ముకై యితరుల ♦ కమ్మివేయు
గీ॥ ఘోర దుర్మార్గ వృత్తులం ♦ దారి తేరి
కొంచమైనను దయ లేక ♦ కొంకులేక
పశువులను జేర్చి యధ్యాస ♦ పడెదు నరులు
ముదముఁ గనఁ జాలరీ సృష్టి ♦ మూల్ల మెరిఁగి॥ ౫
సీ॥ గడ్డివేయక కొన్ని ♦ ముడ్డెండి చచ్చును
పట్టి కొట్టినఁ గొన్ని ♦ పారి చచ్చు
నీరుఁ బెట్టక కొన్ని ♦ నీలిగి చచ్చును
పుచ్చుముల్ దెగి కొన్ని ♦ పుచ్చి చచ్చు
వ్యవసాయమునఁ గొన్ని ♦ జవ లేక చచ్చును
కాలు బెండినఁ గొన్ని ♦ తూలి చచ్చు

బిడ్డకై మరి కొన్ని ♦ రొంగచేఁ జచ్చును
దొడ్డియందే కొన్ని ♦ దొర్లి చచ్చుఁ
గీ॥ గాన నిటువంటి దోషముల్ ♦ గట్టు కొనుచు
పాడి గలుగుట మిక్కిలి ♦ ఫలిత మనుచుఁ
పశువులను జేర్చి యాధ్యాన ♦ పడెదు నరులు
ముదముఁ గనఁ జాలరీ సృష్టి ♦ మూాల మెరిగి॥ ౬

సీ॥ కూటికి లేనట్టి ♦ కూలివాఁడును గూడఁ
బెక్కు రీతులఁ గష్ట ♦ పెట్టుచుండు
బలము లేశము లేని ♦ కుల హీనుఁడును గూడఁ
బెక్కు రీతులఁ గష్ట ♦ పెట్టుచుండు
కాటికై కాళ్ళాచు ♦ కష్టాత్ముఁడును గూడఁ
బెక్కు రీతులఁ ♦ గష్ట పెట్టుచుండు
క్షితిని దుష్కర్ముఁడౌ ♦ ప్రతిమానవుఁడు గూడఁ
బెక్కు రీతులఁ గష్ట ♦ పెట్టు చుండు
గీ॥ నట్టి దుర్వృత్తిపైఁ జాల ♦ దృష్టిఁ బెట్టి
కరుణఁ బోఁ ద్రుంచి మనమునఁ ♦ గఠిన మూని
పశువులను జేర్చి యాధ్యాన ♦ పడెదు నరులుఁ
ముదముఁ గనఁ జాలరీ సృష్టి ♦ మూాల మెరిఁగి॥ ౭

సీ॥ ఉలవలాదిగ మంచి ♦ తెలగపిండిని బెట్టు
సంరక్షణము గోవు ♦ చంటి కొరకె
పచ్చ గడ్డిని దెచ్చి ♦ పదిలంబుగా వేయు
సంరక్షణము గోవు ♦ చంటి కొరకె
యితర చోటిని బాపి ♦ యింటి యందే గట్టు
సంరక్షణము గోవు ♦ చంటి కొరకె

ముసలివాండ్రను గూడ ♦ ముద్దుగా మేపెడి
సంరక్షణము గోవు ♦ చంటి కొరకే
గీ॥ చన్ను మొదిన దయ గుండు ♦ సన్న జుట్టు
హీనవేషము సహజంబుఁ ♦ గాన రాక
పశువులను జేర్చి యభ్యాస ♦ పడెదు నరులు
ముదము గనఁ జాలరీ సృష్టి ♦ మూల మెరిఁగి॥ 6
సీ॥ సంసారమును వీడు ♦ సన్యాసి యైనను
పాలఁ జూచిన సదా ♦ గ్రోల నెంచు
మంత్రముల్ జపియించు ♦ మహానీయుఁ డైనను
పాలఁ జూచిన సదా ♦ గ్రోల నెంచు
పలు శాస్త్రములు నేర్చు ♦ పండితుం డైనను
పాలఁ జూచిన సదా ♦ గ్రోల నెంచు
పతి ధర్మనిరతుఁడౌ ♦ క్షితికాంతుఁ డైనను
పాలఁ జూచిన సదా ♦ గ్రోల నెంచు
గీ॥ దురిత చరితంబుఁ గనక సం ♦ భరితు లగుచు
ముక్తి భుక్తికి శక్తికి ♦ మూల మనుచుఁ
బశువులను జేర్చి యభ్యాస ♦ పడెదు నరులు
ముదముఁ గనఁ జాలరీ సృష్టి ♦ మూల మెరిఁగి॥ 7
సీ॥ భరత ఖండమునందుఁ ♦ బరగు గోదావరీ
పుణ్య నదీతీర ♦ భూమియందు
మొసఁగువానీలంక ♦ యను నట్టి శ్రీ పోల
వర గ్రామమున్న మొగ ♦ వశముచేతఁ
బహుబాధలను జూచి ♦ పది సీసముల నిట్లుఁ
జేసి కృష్ణంరాజు ♦ వ్రాసినట్టి

న్యాయభావముఁ గాంచి ♦ పోయిఁ జెందెదు స్థూల
దేహాభావయోగంబుఁ ♦ దెలియఁ జేయు

గీ॥ శ్రేష్ఠమౌ రాజయోగంబుఁ ♦ జెల్లనీక
మాయ కార్యంబు లవనిపైఁ ♦ మానలేక
పశువులను జేర్చి యధ్యాస ♦ పడెదు నరులు
ముదముఁ గనఁ జాలరీ సృష్టి ♦ మూల మెఱిఁగి॥ ౧౦



ఓం

శ్రీగురుభ్యోనమః

# శ్రీరామరాజయోగి

ప్రణీతంబైన

# సుభాషితపద్య ముక్తావళి.

ఓమ్.

శ్రీ గురుభ్యో నమః.

# సుభాషితపద్యముక్తావళి.

శ్రీ రంజిల్లఁగఁ బంచభూతములతో
సృష్టించి లోకాదులన్
మారం జేయఁగ నెంచి మోసకరమౌ
మాయం దగం జేరి యోం
కారంబై పరమాత్మయై ప్రకృతియై
కామాది షడ్వర్గములన్
దూరం బేగఁగఁ జేయునట్టి కళకిన్
తత్త్వార్థినై మ్రొక్కెదన్ ॥ ౧

శా॥ శంకా తంకములెల్ల మాని మదిలో
సంతృప్తిచే బుద్ధుఁడై
హంకారంబు జయించి నాశకరమౌ
సత్యాశ గుర్తించి హం
సాకారం బెఱిగించు సత్యపరుఁడౌ
సభ్యాసకుం జేరినన్
చేకూరుం గద రాజయోగ పదవిం
జెందించు భాగ్యం బిలన్ ॥ ౨

ఉ॥ ముక్తినిఁ గోరు మానవుఁడు
ముఖ్యముగా మదిలోఁ గుశంకలన్

శక్తికి మూలమౌ ననుచుఁ ♦
నల్పిడి తప్పుడు భోజనంబులన్
వ్యక్తినిఁ బాడుచేయు మతి ♦
వర్తన లాదిగ వీడి యాత్మపై
భక్తిడి యోగ సిద్ధిఁ గని ♦
బ్రహ్మమెఱింగి సుఖింపఁగావలెన్ ॥ 3

ఉ॥ మానిని గర్భమందుఁగల ♦
మాయను తొమ్మిది మాసముల్ వహిల్
దీనతఁ జెంది కుంది వెను ♦
దీయుక తత్క్షణమే యసహ్యమౌ
యోనిని డాసి దివ్యమగు ♦
యోజన యెల్ల హరింపు గాఁగ భీ
తానన మొప్ప ధాత్రిఁ బడి ♦
యాతనఁ జెందు మఱింగి మూఢులై
మానరు దుష్టకార్యములు ♦
మానవ జన్మ తరించు టెట్లొకో ॥ 4

ఉ॥ మాటలు చెప్ప నేర్చి యువ ♦
మానవులెల్లవహించి యుక్తిచే
గోటలుఁ గట్టి తుచ్ఛమగు ♦
కోరికఁ గల్గి మనోవిలాసులై
కాఁటికిఁ జేర్చు నట్టి ఘన ♦
కంటక సంతతిఁ గాంచు మానవా
నాటక చర్యలీ నరులు ♦
నమ్మి గ్రహించుట నిష్ఫలం బిలన్ ॥ 5

ఉ॥ అంధతఁ జెంది కాంతలకు ♦
సాయమొసంగఁ దలంచి దుష్టులై
వందలు వేలు రూకలను ♦
వక్రతఁ బూని గడించి శ్రద్ధతో
సుందరమైన హార్మ్యములు ♦
సొంపలరంగ రచించి పొంగుచున్
ముందటి ముప్పుఁ గానరిల ♦
మూర్ఖులు గారె! తలంపఁగా నరుల్॥ ౬

చ॥ కల కల లాడు స్వచ్ఛమగు ♦
కాంతిఁ దనర్చి మహోపయోగమౌ
ఫలములు దుంప లాకులును ♦
బచ్చని కాయలు ధాన్యముల్ సదా
సలిలము తెల్లచోటులను ♦
చల్లని వాయువుఁ గల్గియుండఁగాఁ
బలలము మెక్కనేల? మరి ♦
పాడగు మద్యముఁ ద్రావ నేల? దు
ష్ఫల మిడు దుష్టవాయువులు ♦
బాగని పీల్చఁగ నేల మానవుల్॥ ౭

తే॥ గీ॥ సూక్ష్మ దృష్టినిఁ బరికించి ♦ సృష్టిఁ గాంచి
యాత్మ భావంబు శోధించి ♦ యహముఁ ద్రుంచి
నిర్వికల్ప స్వరూపుఁడై ♦ నిలుచు నట్టి
వాఁడె! సిద్ధుడు వర్యుఁ డీ ♦ వసుధ లోన॥ ౮

తే॥ గీ॥ వచ్చు నప్పుడు తానేమి ♦ తెచ్చు కొనెనొ?
ద్రవ్య మార్జించి మూట కట్టి ♦ దారిఁ గనునొ?
వెళ్లు నప్పుడు తన కేది ♦ వెంటఁ బడునొ?
తెలిసికొనువాఁడ! బాధముల్ ♦ త్రెంచి వైచు॥ ౯

తే॥ గీ॥ నిన్న యనియెడి దివసమిఁ ♦ కెన్నటికినిఁ
గాల చక్రంబు గుర్తించి ♦ కాంచ లేవు
కాన పరమాత్మయుద్దేశ ♦ మును గ్రహించి
సోహ భావంబుఁ గని సృష్టిఁ ♦ జూడు మనస॥ ౧౦

తే॥ గీ॥ కన్నులా లేక చూడఁగాఁ ♦ గాళ్ళు లేక
నడచుటకు లేక కుడువఁగాఁ ♦ గూడు లేక
గృహములోఁ గుంది భూమిపైఁ ♦ గూరుచున్న
మానవుండైన దుశ్చింత ♦ మానఁడకట॥ ౧౧

తే॥ గీ॥ తనువు జన్మించు మార్గంబుఁ ♦ దలచుకొనుచు
సత్యమెడబాసి చింతతోఁ ♦ జచ్చు నట్టి
ప్రజ్ఞగుర్తించి వర్తించు ♦ బ్రహ్మచారి
మానసము చిక్కుఁ జెందునే? ♦ మాయవలన॥ ౧౨

తే॥ గీ॥ ఇంట నెప్పుడు బాధించు ♦ కొంటె భార్య
కన్ని విధముల భయపడు ♦ నధము నర్థుని
కట్టి పౌరుషముండదు ♦ విద్యముండ
దరయ సుజ్ఞాన ముండదీ ♦ యవని యందు॥ ౧౩

తే॥ గీ॥ భూతి ధరియించి రుద్రాక్ష ♦ మాల కూర్చి
జడలు తెగఁబెంచి హిందువై ♦ జగతి యందుఁ
గూడు మింగుచు గంజాయి ♦ వాడునట్టి
వలుగు సాధులఁ జేరకే! ♦ సాధు మనస॥ ౧౪

తే॥ గీ॥ అనుభవము గల్గు సద్గురు ♦ నాశ్రయించి
సంశయముఁ ద్రుంచి స్థిరమైన ♦ సాధు విద్యఁ
బొందవలెఁ గాని చిత్తమా! మందుఁడైన
పలుగు మనుజునిఁ జేరిన ♦ ఫలము గలదె?॥ ౧౫

తే॥ గీ॥ భేద వాదంబు లడఁచు న ♦ ద్వైతఁ గాంచి
హఠము సాధించి పరికించి ♦ కుటిల చర్య
లెల్లఁ దొలఁగించి యానంద ♦ ముల్ల సిల్లు
మురిపె మెరిఁగి నటించు టే! ♦ ముక్తి మనస!॥ ౧౬

తే॥ గీ॥ నీచ కార్యంబులన్నింటి ♦ నిలిపివేసి
యాత్మ చింతన నియతితో ♦ నభ్యసించి
సోహ భావంబుఁ గని నిత్య ♦ సుఖముసంగు
మూర్తి పంతము జేరు టే! ♦ ముక్తి మనస!॥ ౧౭

తే॥ గీ॥ ముందు మానవ భోజన ♦ మూల మెరిఁగి
దేహ మార్గంబులన్నియుఁ ♦ దెలిసి కర్మ
సంశయముఁ ద్రుంచు సద్గురు ♦ సరసఁ జేరి
చిత్తమా! వాయు కుంభక ♦ సిద్ధిఁ గనవె!॥ ౧౮

తే॥ గీ॥ కల్మషంబులు గల పొట్టఁ ♦ గడిగి నిత్య
మింద్రియము లన్నిఁటిని బాధ ♦ కిష్ట పరచి
సృష్టి గుర్తించు హఠయోగ ♦ నిష్ఠఁ బూని
సంత సింపవె చిత్తమా! ♦ సత్య మెరిఁగి ॥ ౧౯

తే॥ గీ॥ శుక్ల శోణిత శక్తిచే ♦ సృష్టి యందుఁ
దిరుగు మానవులకు దుఃఖ ♦ భరిత మైన
జాతి మతముల నన్నింటి ♦ జార విడిచి
గతినిఁ గని మను! చిత్తమా! కలదు సుఖము॥ ౨౦

తే॥ గీ॥ బుద్ధి వికసింప సర్వము ♦ ధ్యవము నొందు
బదియడంగిన వెంటనే ♦ చెదరి పోవు
ఒదిఁగి గురువరు దరిఁ జేరి ♦ మరుఁగు దెలిసి
ముక్తి జెందవె చిత్తమా! మోన వశత॥ ౨౧

తే॥ గీ॥ ఆలు బిడ్డలు తలిదండ్రు ♦ లన్న దమ్ము
లధిక బద్ధాను రాగులై ♦ యాదరించి
మృతినిఁ దప్పింప నేరని ♦ యూల మరసి
సూటిఁ గనకున్నఁ జిత్తమా! ♦ సుఖము గలదె?॥ ౨౨

తే॥ గీ॥ రాజ యోగంబు సాధించు ♦ పూజ నీయు
పాదములఁ బట్టి శాశ్వత ♦ పదవిఁ గాంచి
సృష్టి శోధించి సర్వదా ♦ దుష్ట బుద్ధి
విడిచి వర్తించు చిత్తమా! ♦ ఏలు దెలిసి॥ ౨౩

కం॥ ఘన మనుకొని ధన మదమున
మనమున గడు మురిసి మురిసి ♦ మసలెడి మనుజుల్
గనఁ గలరె! నిజము దెలిపెడి
జననుతు డగు విహిత గురుని ♦ చరితము జగతిన్॥ ౨౪

కం॥ తన పనికై యనుదినమును
మనమునఁ బ్రేమించి వచ్చు ♦ మరి మరి తిరిగే
మనుజునితో స్నేహించుట
కను పద్ధతి సర్వులెవ్వ ♦ రొకరు ధరిత్రిన్॥ ౨౫

ఆ॥ వె॥ ఆశ వలన గలుగు సంటును ♦ దెగఁద్రెంచు
దేహ పోషణ విధిఁ ♦ దెలిసి సర్వ
మాయ కార్యములను ♦ మాని మానిని పొందు
విడిచి తిరుగు వాఁడె! ♦ విహిత గురుఁడు॥ ౨౬

ఆ॥ వె॥ సత్య పరునిఁ జేరి ♦ సంతోష మొప్పంగ
నాసనములఁ దెలిసి ♦ యభ్యసించి
కాయ శుద్ధిఁజేసి ♦ కష్టంబు లెడఁ బాసి
బ్రతుక నేర్చి బాగు ♦ పడవె? మనస!॥ ౨౭

ఆ॥ వె॥ దేహ యంత్ర మహిమ ♦ దెలిసి కృష్ణంరాజు
రోగ మడఁచి రాజ ♦ యోగి యయ్యెఁ!
గాని భుక్తివల్ల ♦ జ్ఞానంబు గల్గునా?
సృష్టిధర్మ మెఱిఁగి ♦ చూడు! మనస! ॥ ౨౮

సీ॥ కాశి యాత్రకుఁ బోయి ♦ పోసి గంగను దెచ్చి
సంతర్పణంబులు ♦ సలుప వచ్చు
నుదయంబున నె లేచి ♦ యుదకంబులోఁ జేరి
మునిఁగి జపంబులో ♦ మురియవచ్చు
మనసు కోరికఁ దీర ♦ ధనము సంపాదించి
మాయా కార్యము లెల్లఁ ♦ జేయవచ్చు
బహు స్త్రీల దోషముల్ ♦ భరియించి సర్వదా
సంసార కష్టముల్ ♦ సైచ వచ్చు
గీ॥ రూఢిగా సర్వవస్తువుల్ ♦ గూడఁ బెట్టి
వదల కెప్పుడుఁ దిను చుండ ♦ వచ్చుఁ గాని
వక్త్రి వృక్షంబులకుఁ గల ♦ వైర బుద్ధి
మాన్పఁ జూచుట సులభమా! ♦ మానవులకు॥ ౨౯

సీ॥ తను కృశత్వముఁ గల్గి ♦ ఘనమైన కళలచే
ముఖము ప్రకాశించి ♦ ముద మొసంగ
నాదంబు స్పష్టమై ♦ నయనముల్ నిర్మల
దృష్టిచేఁ జాల సం ♦ తుష్టిఁ జూప

రాగాదు లెడఁబాసి ♦ రోగ రాహిత్యమై
బిందు ధారణ దేహ ♦ మందె కలుగ
నగ్ని దీపన శక్తి ♦ యతిశయింపఁగ నెల్ల
నాడీ సమూహంబు ♦ ననువు పరచి

గీ॥ శుద్ధిఁ గావించు హఠయోగ ♦ సిద్ధి మైన
యోగి వర్యుండు శాశ్వత ♦ భోగి యగును
గాని మితిలేని గ్రంథముల్ ♦ గని పఠించు
మాయ వేదాంతి కెట్టులీ ♦ మహిమ గలుగు?॥ ౩౦

సీ॥ శ్రీమించు శ్రుతిక్రియా ♦ శీలంబు లుండఁగా
హంస భావమెరింగి ♦ హింస మాని
సద్గురు కరుణచే ♦ సకల సాధులు మెచ్చ
హఠ సాధనము వల్ల ♦ ఘటముఁ దెలిసి
శుద్ధిఁ జేయుచు దివ్య ♦ సుఖ తరంబై పట్టి
రాజయోగానంద ♦ తేజ మమరి
వర్తించి పొత్తూరి ♦ వంశ ప్రదీపుఁడై
యొప్పు కృష్ణంరాజ ♦ యోగివర్యుఁ

గీ॥ డగ్రజుఁడు గాన దరిఁ జేరి ♦ యాశ్రయించి
నిజము పరికించి హఠయోగ ♦ నిష్ఠఁ గాంచి
బ్రతుకు ఫలితంబుఁ గనుగొన్న ♦ బ్రహ్మచారి
యైన శ్రీరామ రాజాఖ్యుఁ ♦ డార్య వరులు
జూచి హర్షింపఁ బద్యముల్ ♦ జేసెనిట్లు!॥ ౩౧

ఓమ్

# శ్రీమదుత్తమక్షత్రియ గృహనామసీసమాలిక



శ్రీక్షత్రియాహ్వయ ♦ క్షీరార్ణవంబునం
దాదిత్య వంశోద్భ ♦ వంబులైన
స్థిర వసిష్ఠస గోత్ర, ♦ వర ధనంజయ, కాశ్య
పసగోత్ర, కౌండిన్య ♦ యు, సుభరద్వ
జసగోత్ర, పంచకం ♦ బనమాన మగు నందు
రసవంతమై పూర్వ ♦ రచితమైన;
వర పూసపాటి, స ♦ ద్వాత్సవాయ్, కల్దిండి,
కాకర్లపూడియు, ♦ కంకిపాటి,
కంతేటి, గొడవర్తి, ♦ కనుమూరి, కోసూరి,
పొత్తూరి, మంతెన, ♦ పోచిరాజు,
అల్లూరి, జంపెన, ♦ యడ్డూరి, నంద్యాల,
గుంటూరి, గురజాల, ♦ కొలనువాడ,
అడ్డా, డిసుకపల్లి, ♦ యబ్బురా, ట్చిటూరిజు,
చెంపాటి, చెరుకూరి, ♦ చెరుకువాడ,
కమ్మిల, గూడూరి, ♦ బొమ్మిడా, లంగర,
దండు, నందెలపల్లి, ♦ దంతులూరి,

కుచ్చర్లపాటి, పె ♦ న్మాత్స, కళ్లేపల్లి,
యాదరపల్లి, కు ♦ నాధరాజు,
కొండూరి, చిలుకూరి, ♦ కొప్పర్ల, చేకూరి,
పంతపాటి, కళారి, ♦ పత్సమట్ల,
ధేనువకొండ, యా ♦ వనరాజు, వలివర్తి,
కుచ్చర్లకోట, కొ ♦ క్కెర్లపాటి,
రావిపా, ట్నల్లప ♦ రాజు, నాశవ పల్లి,
దెందుకూ, రియ్యూరి, ♦ మందపాటి,
బుద్ధరా, జంగరా, ♦ జగ్దేవ, ల్చింతల
పాటి, సయ్యపరాజు, ♦ పాలపాటి,
లఘుమరాజు, దుర్గ ♦ రాజు, రుద్రరాజు,
వేజళ్ల, పాకపా, ♦ ట్వేముపాటి,
భూపతిరాజు, నం ♦ బూరి, వేములమంద,
యాదుమూ, డిందుకూ, ♦ ర్బొడరాజు,
గణపతిరాజు, ము ♦ మ్మనరాజు, భైర్రాజు,
వేగేశి, నోర్గంటి, ♦ వేగిరాజు,
తిరుమలరా, ట్తోట ♦ కూరి, కూచంపూడి,
పిన్నమ రాజును, ♦ పేరిచర్ల,
మద్దాల, ముదునూరి, ♦ మల్లపరాజును,
యులసి, గోరింటయు, ♦ ములగపాటి,
ఉప్పలపాటి, కూ ♦ నపరాజు, ముద్దుండి,
కొవ్వూరి, దోనపా, ♦ ట్కాల్తపల్లి,
నడిమిప, ల్గాదిరా, ♦ ట్వాడప, లుద్దరా,
ట్చెరుకుర్తి, జంపన, ♦ చెల్లగళ్ల,

గొట్టిముక్కల, సాగి, ♦ గోకరా, బెజవాడ,
సామంతపూడియు, ♦ సాగిరాజు,
దాట్ల, బెల్లంకొండ, ♦ దైనాల, ముదురాజు,
కొల్నాటి, వెలగలే, ♦ టొక్కలుకులూరి,
వఖనేటి, చాళ్ళరాజు, ♦ సరిపల్లి, వేటూకూరి,
యంకిపా, ట్సిరువూరి, ♦ యమలరాజు,
బ్రహ్మరాజు, యవన, ♦ భేతాళ, జుజ్జూరి,
గంద్రాజు, చోడ్రాజు, ♦ గరికపాటి,
లూటికూ, ర్వాకల ♦ పాటి, మైనంపూడి,
వానపా, శ్వేవూరి, ♦ వడ్లమూడి,
యూవ నూట ముప్పది ♦ యారు పేర్లను గ్రామ;
పౌరుషంబులు; ముఖ్య ♦ పురుషములనఁ
ద్రివిధంబులగు వాని ♦ వివరించి శ్రీ పోల
వర దివ్య పొత్తూరి ♦ వంశ జనితుఁ
గీ॥ డైన శ్రీ రామరాజాఖ్యుఁ ♦ డాంధ్రదేశ
వాసులౌ క్షత్రియోత్తముల్ ♦ జూచి మెచ్చ
సీసమాలిక శ్రద్ధతోఁ ♦ జేసె నిట్లు;
సుగుణ ధనులార! జనులార! చూడరయ్య!॥

